# వి. ఆర్. నార్ల
# జీవితం - అనుభవాలు








...న్నయ్య, ఎం.ఏ., పిహెచ్.డి.,

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు

# వి. ఆర్. నార్ల
# జీవితం - అనుభవాలు

రచన

డాక్టర్ ఎన్. ఇన్నయ్య ఎం. ఏ, పి. హెచ్. డి.






ప్రచురణ:

తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు

V. R. NARLA JEEVITHAMU - ANUBHAVAA
in Telugu By DR. N. INNAIAH

తెలుగు విశ్వవిద్యాలయం,
హైదరాబాదు-500 004.

ప్రథమ ముద్రణ : 1987
ప్రతులు : 2000
వెల : రూ. 7/-



ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు

ప్రతులకు :
తెలుగు విశ్వవిద్యాలయం,
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500 004.

ముద్రణ :
శ్రీ శ్రీనివాసా ఆర్ట్ ప్రింటర్స్,
2-128, రోడ్ నెం. 4,
శోభన కాలనీ, బాలానగర్,
హైదరాబాదు-500 042.

# ప్రకాశక విజ్ఞప్తి

సాహిత్యం ఒక జాతి జీవన సంస్కృతికి అక్షరరూపం. ఒక తరం ఆలోచనలు, ఆచరణ విధానాలు, సామాజిక స్థితిగతులు మరోతరానికి అద్దంలో ప్రతిబింబంలా చూపగలిగేది సాహిత్యం. అందువల్ల జాతి సంస్కృతిని బేరీజు వేయడంలో సాహిత్యం ఒక మహత్తరమైన, బలవత్తరమైన సాధనం. ఒక జాతి సాహిత్యంద్వారానే ఆ జాతి ఔన్నత్యం అ గతమవుతుంది. అంతటి సాహిత్యాన్ని పదిలపరచుకోవడమే కాదు, పరిపుష్టం చేసుకోవలసిన బాధ్యత ఆ జాతిపై ఉంటుంది.

ఆ పరిధిలోనే తెలుగుజాతి సాహితీ సంస్కృతుల అభ్యున్నతికి వేదికగా ఏర్పడినది తెలుగు విశ్వవిద్యాలయం. బోధన, పరిశోధన, ప్రచురణ ముఖ్యాంగాలుగా గల తెలుగువిశ్వవిద్యాలయం ప్రచురణ శాఖాముఖంగా పై బాధ్యత నిర్వర్తించడానికి పూనిక వహించింది.

ఆ లక్ష్య పరంపరలోనే ఉదయించిన దీగ్రంథం. కీ శే. నార్ల వెంకటేశ్వర రావు నవమేధావి నార్లగా ఒక గుర్తింపు పొందిన విలక్షణమైన, విశిష్టమైన వ్యక్తిత్వం గల రచయిత. తెలుగు పత్రికారచనకు సరికొత్త ఒరవడిని దిద్దినవారు. వీరి రచనలలో అభ్యుదయభావాలు జీవం పోసుకొంటాయి. వీటిలో కొన్ని ఆధునిక తెలుగు సాహితీ మంజూషలో అనర్ఘ రత్నాలుగా భాసిస్తాయి. కీ. శే. నార్ల వారి జీవిత రేఖలు, ఆ రేఖలలోని అనుభవాల మెరుపులను విహంగవీక్షణంగా ఆవిష్కరించడానికి చేసిన ప్రయత్నమే ఈ లఘుగ్రంథం. దీనిని రచించిన వారు డాక్టర్ ఎన్. ఇన్నయ్యగారు. వారికి మా ధన్యవాదాలు. ఉత్తమాభిరుచిగల పాఠకులకు ఈ పుస్తకం రుచిస్తుందనే మా ఆశ!

హైదరాబాదు,
తేది : 16-11-1987.

ప్రకాశకులు,
తెలుగు విశ్వవిద్యాలయం.

# ముందు మాట

జర్నలిస్టుగా ప్రారంభమై మానవతావాదిగా పరిణమించిన శ్రీ నార్ల వెంకటేశ్వరరావు (వి. ఆర్. నార్ల) జీవితప్రవాహంలో ఎదురీది నిలిచి గెలిచిన వ్యక్తి. వృద్ధుడయ్యే కొద్దీ ఛాందసం చాదస్తం భక్తి ముదురుతాయనే నమ్మకాన్ని తప్పు అని నిరూపించారు. "తిట్లు, పొగడ్తలు ఏవైనా గానీ, మనిషిని గురించి చర్చించాలి'' అనేది వి. ఆర్. నార్ల సూత్రం. ఆయన దీనిని జీవిత పర్యంతం అక్షరాలా పాటించారు. నిరంతర ఆలోచనా పరంపరలో పత్రికారచన నుండి గ్రంథరచనకు, ప్రస్థానం సాగించారు: అందునా ఆంగ్లంలో వెల్లడిస్తూ పోయారు. నార్ల రచనలు, సంపాదకీయాలు ఎప్పుడూ చర్చనీయాంశాలుగానే ఉండేవి. ఉద్యోమాలలో పదుగురాడు మాట పాటియై ధరచెల్లినా, నార్ల తన వివేచననే అనుసరించారు. రాజీనామా పత్రాన్ని సర్వకాలాలలోనూ జేబులో పెట్టుకొని ఉద్యోగాలు చేసిన స్వాభిమాని నార్ల. జర్నలిజానికి ఆయన వన్నె తెచ్చారు. పత్రికారంగంలో కష్టాలంటే ఏమిటో బాగా కాచి, వడబోసిన నార్ల వివిధ యాజమాన్యాల తీరుతెన్నులు కూడా అవగాహన చేసుకొన్నారు. విదేశీ పర్యటనలలో, దినపత్రికల ఎడిటర్‌గా, రాజ్యసభ సభ్యుడుగా, అనేక సంఘాల సభ్యుడిగా నార్లకు విశేష అనుభవం ఉన్నది .సుదీర్ఘమైన ఆయన జర్నలిస్టు జీవితంలో మిత్రులు, శత్రువులూ ఉన్నారు నార్ల రాగద్వేషాలకు, తీవ్రధోరణులకు తట్టుకొని కొందరే మిత్రులుగా మిగిలిపోగలిగారు.ఆంధ్రదేశంలో సంపాదకులు కొందరు రాష్ట్రం వెలుపల కీర్తిప్రతిష్ఠలు ఆర్జిస్తే శ్రీనార్ల పత్రికారచనను ఒక వృత్తిగా స్వీకరించి తెలుగులోకంలోనే ఖ్యాతి తెచ్చుకొన్నారు. కేవలం నార్ల సంపాదకీయాల కోసమే దినపత్రిక చదివిన వారున్నారు. నార్ల ప్రభావంతో ఆలోచించిన వారూ ఉన్నారు. అదొక తరం. జర్నలిజంనుండి విరమించిన తరువాత నార్ల మేధావిగా ఇంగ్లీషులోను, తెలుగులోన అనేకరచనలు చేశారు.

మేధావులుండుగా వేదభూమిలోన అనేది శ్రీ నార్ల చిట్టచివర రాసిన మకుటం. ప్రమాణాలను గుడ్డిగా నమ్మి జీవితం సాగించాలంటే మానవుడు ముందుకు సాగలేడు. ప్రతీది ప్రశ్నించమంటాడు నార్ల! ఆలోచించకుండా పదిమందితో పాటు ప్రవాహంలో పడిపోవడం సులభం. కానీ ప్రగతి ఉండదు, మనిషి ఎదగడు.

నేడు భావసాహసం కావాలి. విజ్ఞానపూరితమైన ఆలోచన జరగాలి. విద్యార్థులు, యువకులు ఈ కృషికి అలవాటుపడితే మానవజాతికి నిరంతర అభ్యుదయం ఉంటుంది. శ్రీ నార్ల అలాంటి ధోరణికై కృషి చేశారు.

అలాంటి వ్యక్తి గురించి ఇంకెంతో పరిశోధించి సమగ్ర పరిశీలక రచనలు రావలసి ఉన్నాయి. అందుకు నాందిగా ఈ చిన్న గ్రంథం తోడ్పడగలదని భావిస్తున్నాను. ఆయన జీవితవిశేషాలను, అనుభవాలను సంక్షిప్తంగా వివరించడానికి ఈ రచనలో ప్రయత్నించాను. శ్రీ నార్ల మానవతా, హేతువాదుల 'మైనారిటీ' వర్గానికి చెందిన ఆలోచనాపరులు. ఈవర్గం బాగా విస్తరిల్లి పెంపొందిన నాడు ప్రగతి ఇంకా అనేక విధాల వికసిస్తుంది. భావాల ప్రభావం నిరంతరంగా పనిచేస్తుంటుంది. నార్ల భావాలు ఎంతోమందిలో ఆలోచనలు రేకెత్తిస్తే ఈ రచన అంతమేరకు కర్తవ్యాన్ని సాధించినట్లే భావించవచ్చు.

శ్రీ వి. ఆర్. నార్ల జీవితాన్ని మోనోగ్రాఫ్‌గా రాయమని తెలుగు విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్స్‌లర్ ఆచార్య తూమాటిదొణప్పగారు 1986 ఉగాది నాడు నార్ల పరిశోధనా సంస్థ శంకుస్థాపన (హైదరాబాద్‌లో)సందర్భంగా అడిగారు. దాని ఫలితమే నార్లపై ఈ మోనోగ్రాఫ్. ఉత్తరోత్తరా విపులమైన జీవిత చరిత్ర రాయవలసి ఉంది.

ఎన్. ఇన్నయ్య

# విషయసూచిక

# బాల్య, విద్యార్థి దశ

నార్ల వెంకటేశ్వరరావు గారి తాత ముత్తాతలు కృష్ణాజిల్లా కాటూరు గ్రామానికి చెందినవారు. రెండవ మైసూరు యుద్ధపు సమయంలో (1890-91) మిలిటరీ కంట్రాక్టర్లుగా వారు పని చేశారు. సైన్యం ఒకచోటి నుండి మరొక చోటికి తరలి పోతుండగా ఆహార సరఫరాలు చేయడానికి బండ్ల మీద సరుకులు పెట్టుకొని వీరూ వెంటపోతుండేవారు. ఆ విధంగా నార్ల గారి తాతలు హనుమయ్య, వెంకయ్య మధ్యపరగణాలు లోని సాగర్ ప్రాంతానికి చేరుకొన్నారు. అప్పటికి బ్రిటిషు పాలనలో బండ్ల కంట్రాక్టుకు స్వస్తి పలికారు. మోటారు వాహనాలు, ఆధునిక పద్ధతులు ప్రవేశ పెట్టారు. నార్ల ముత్తాతలు, తాతలు సాగర్‌లో స్థిరపడి పోయారు. వారంతా చదువుకొన్నవారు కాకపోయినప్పటికీ ఈ మిలిటరీ కంట్రాక్టులో విపరీతంగా ధనార్జన చేసి సంపన్నులైనారు. దేవాలయాలు కట్టించడం, బావులు తవ్వించడం, తోటలు పెంచడం, ఒక వీధంతా వీరి పేర నిర్మించడం కూడా జరిగింది. నార్ల తాతగారైన వెంకయ్యకు 13 మంది సంతానం. వారిలో ముగ్గురే బ్రతికారు. అందులో గోవిందరావు నార్లకు పెదనాన్న, లక్ష్మణరావు తండ్రి. మేనత్త కూడ నార్ల విషయములో చాల శ్రద్ధ వహించేది. నార్ల తండ్రి ప్రాథమిక విద్యతోనే సరిపెట్టుకొన్నారు. పెదతండ్రి గోవిందరావు చాల విలాసంగా బ్రతకటానికి అలవాటుపడి ముందూ వెనుక చూడకుండా ఖర్చు పెట్టేవారు. గుర్రప్పందాలలో చాలా కరిగిపోయింది. సంపాదన లేకుండ ఈ విధంగా పెట్టిన ఖర్చుకు ఆస్తులన్నీ కరిగిపోయాయి. కలకత్తా వెడితే సినిమా చూడడానికి హాలు అంతా రిజర్వు చేసుకొని తమ కుటుంబం తప్ప మరెవ్వరూ ఉండరాదు అనే గొప్పలకు పోయేవారు. ఆ విధంగా చూస్తుండగానే ఆస్తులు కరిగిపోగా పెదనాయన గోవిందరావు పేదరికాన్ని భరించలేక జీవితాన్ని అంతం చేసుకొన్నాడట. నార్ల తండ్రి లక్ష్మణరావు కవుతరానికి చెందిన మహలక్ష్మమ్మను వివాహమాడారు. సాగర్‌లో వారికి పుట్టిన సంతానం చనిపోగా రెండవ సారి మేనత్త

1 న జబల్‌పూర్‌లో పుట్టారు. నార్ల పుట్టేనాటికి కుటుంబం పేదరికంలో పడి పోయింది. మా తాతలు నేతులు తాగారని చెప్పుకోవడం తప్ప ఇంకేమీ లేని స్థితికి వచ్చింది. తరువాత నాలుగేళ్ళకు నార్ల తమ్ముడు గౌరీశంకర్, సాగర్‌లో పుట్టారు. మహలక్ష్మమ్మ తను భద్రపరచిన నగానట్ర పొదుపుచేసి దాచిన కొంత ధనం కవుతరంలో తన వారికి పంపించి తమకు ఇళ్లు పొలం ఏర్పరచమని కోరింది.

తొలి ప్రపంచ యుద్ధం 1914 లో ప్రారంభమైనప్పుడు నార్ల కుటుంబం ఇంచుమించు పొట్టచేత పట్టుకొని కవుతరం చేరుకొన్నది. 1915 తొలి రోజులలో వీరు ఆ గ్రామానికి వచ్చారు. వచ్చేటప్పుడు వెంట సుమారు రూ. 15,000 వరకూ ధనం, 200 నవరసుల బంగారం, 2 బుట్టల వెండి సామాన్లు మహలక్ష్మమ్మ గారు వెంట తెచ్చారు. తీరా చూస్తే ముందే పంపిన డబ్బును ఖర్చు చేసుకున్నారే తప్ప ఆస్తిపాస్తులేవీ ఏర్పరచ లేదు. కాని కవుతరంలో ఒక పాత ఇల్లు ఇచ్చారు. రెండెకరాల పొలం ఏర్పరచారు. నార్ల తండ్రి లక్ష్మణరావుకు తెలుగు రాదు. ఏ వృత్తిలోనూ ఆయనకు ప్రవేశం లేదు. ఒక విధంగా కుటుంబ పోషణభారం తల్లి మహలక్ష్మమ్మ పై పడింది. ఆమె పిల్లల్ని జాగ్రత్తగా చూసుకొంటూ పొదుపుగా వ్యవహరించింది. తన వెంట తెచ్చిన సామాన్లు ఒకటొకటి అమ్ముతూ చదువులకు ఖర్చు పెట్టారు. కవుతరానికి వచ్చిన తరువాత మరో ఇద్దరు సంతానం కలిగారు. అందులో ఒకరు శ్రీ నార్ల తాతారావు. వారికి చెల్లెలు కూడ పుట్టింది. తండ్రి లక్ష్మణరావు చిలుకపలుకులవలె తెలుగు మాట్లాడటం తప్ప అంతకు మించి ఆయనకు భాష పట్టుబడ లేదు. కొద్దిరోజుల పాటు హిందీ టీచర్‌గా పని చేశారు. తెలుగు దినపత్రిక ముందు పెట్టుకొని హెడ్డింగులలోని పెద్ద పెద్ద అక్షరాలు కూడబలికి చదువుకుంటూ నాకూ తెలుగు వచ్చునని అంటుంటే మహలక్ష్మమ్మ నవ్వుకుంటూ ఉండేది. ఈ స్థితి తన సంతానానికి రాగూడదని ఆమె భావించింది. ఏమయినా సరే, వారిని చదివించి పైకి తీసుకు రావాలని పట్టుదల వహించింది.

కవుతరం చిన్న వ్యవసాయ గ్రామము. కృష్ణా జిల్లాలో గుడివాడ బందరు మధ్య ఉన్నది. రోడ్డ ప్రయాణానికి ప్రైవేటు బస్సు ఒక్కటే ఆనాడు ఆధారం. మార్మగోవా-బందరు రైలు మార్గం వున్నది. బందరు జిల్లాకేంద్రం కాగా, గుడివాడ సమీపములో ఉన్న చిన్న సంపన్న నగరం. కవుతరంలో అప్పటికే

ఒక ప్రాథమిక పాఠశాల ఉండేది. అందులో నార్లను చేర్చారు. అప్పుడే నార్ల తెలుగు నేర్చుకున్నారు. తెలుగు వాతావరణంలో ఆయనకి త్వరగానే భాష పట్టు బడింది. బోర్డు ఎలిమెంటరీ స్కూల్ హెడ్‌మాస్టరుగా రమణయ్య ఉండేవారు. ఆయనంటే గ్రామమంతా బాగా గౌరవించే వారు. ఇంకా పాపయ్య, కృష్ణయ్య, లక్ష్మీనారాయణ టీచర్లుగా ఉండేవారు. వీరిలో పాపయ్య మాస్టరు అంటే పిల్లలకు హడల్‌గా ఉండేది. చదువు చెప్పడంలో కృష్ణయ్య మాస్టరు పిల్లలను విశేషంగా ఆకర్షించే వారు. 10 వ ఏట ఈ ప్రాథమిక పాఠశాలలో చేరిన నార్ల, 5వ తరగతి వరకు ఇక్కడ చదువుకున్నారు. కవుతరం లోనే ఆంధ్రలక్ష్మి ఎడ్వర్డు మెమోరియల్ స్కూల్ పేరిట ఒక ప్రైవేట్ పాఠశాల ఉండేది. అందులో చేరి సెకండ్ ఫారమ్ (నేడు 7వ తరగతి) వరకు చదివారు. ఆ రోజులలో ప్రాథమిక విద్య అయిన తరువాత ఫస్టుఫారమ్‌లో చేర్చుకునేవారు. అంటే 6వ తరగతి అన్న మాట. ఎనిమిదో ఫారమ్ వరకు మిడిల్ స్కూల్ అనేవారు. కవుతరంలో ప్రైవేట్ మిడిల్ స్కూల్, ఒక రైసుమిల్లువారి ఆర్థిక సహాయంతో కొళంద రెడ్డి ప్రారంభించారు. దీనికి చెఱుకువాడ నరసింహంగారు హెడ్‌మాస్టరుగా పని చేసారు. ఆయన పెట్టిన సంప్రదాయాలలో స్కూలు నడిచేది. ఆయన ఉపన్యాస చక్రవర్తి అని, వాక్ డిండిభ అని పేరు తెచ్చుకున్నారు. జాతీయ ఉద్యమంచే ప్రభావితులైనవారిలో ఆయన ఒకరు. అలాంటి వారి ఆధ్వర్యంలో నార్ల చదువుకున్నారు. కవుతరంలో నార్ల చదువు సంధ్యలకు ఆయన పెద్దనాయన కూడ తోడ్పడుతూ ఉండేవారు. అయితే చదువులెందుకని ఆయన నిరుత్సాహ పరుస్తూ తరచు వ్యాఖ్యానిస్తూ ఉండేవారు. కాని తల్లి పట్టుదల వహించి చదివించింది.

1922-23 నుండి నార్ల గుడివాడలో బోర్డు హైస్కూల్‌లో ఫిఫ్త్ ఫారమ్ (10వ తరగతి) వరకు చదివారు. అక్కడ నార్ల బంధువు వార్ల వెంకట సుబ్బయ్య గారు వకీలుగా ఉంటుండేవారు. ఆయనింట్లో ఉండి చదువుకుంటూ ఉండగా, 1923 జూన్‌లో ఇంగ్లండునుంచి సెలవులకు వచ్చిన లింగం వీరభద్రయ్య చౌదరి వారి ఇంటికి వెళ్ళారు. ఆఫీసు బల్లమీద ఇంగ్లీషు కాంపోజిషన్ పుస్తకం చూచి బాగా వ్రాసినట్లు ఉంటే ఎవరు వ్రాసారని అడిగారట. నార్ల వెంకటేశ్వర రావు నేనే వ్రాసానని చెప్పారట. (1) గుడివాడలో చదువు ప్రారంభించినప్పటి

(1) 'స్వవిషయం' - ప్రథమ భాగం పేజీ 9 273-లింగం వీరభద్రయ్య చౌదరి, త్రివేణి పబ్లిషర్స్, మచిలీపట్నం - 1973.

నుండి నార్లకు ఆయన సోదరులకు, మధ్యపరగణాలలో ఖట్నీ నుండి నార్ల వెంకటరామన్న ప్రతి నెల మనిఆర్డరు పంపించే వారు. 12 సంవత్సరాలు ఆ విధంగా ఖట్నీ నుండి వరస తప్పకుండ డబ్బు వచ్చేది. జీవితంలో ఈ సహాయం నార్లకు ఆయన సోదరునకు ఎంతో తోడ్పడింది. ఖట్నీలో మునిసిపల్ చైర్మన్‌గా 30 సంవత్సరాలు పనిచేసిన వెంకటరామన్నకు గౌరవ మెజిస్ట్రేట్ పదవి కూడ ఉండేది. ఒకసారి పరీక్ష ఫీజుకై మనిఆర్డరు పంపిస్తూ ఈ డబ్బు సమయానికి చేరకపోతే వెంటనే టెలిగ్రాం ఇవ్వమని, అప్పుడు టి.ఎం.ఓ పంపిస్తానని కూపన్‌లో వ్రాసారు. మనిఆర్డరు అందితే ఆ కూపన్ పై వ్రాసిన విషయానికి టెలిగ్రాం అక్కర లేదు కదా. కాని ఖట్నీలో ఆయన దూరాన ఉన్న పిల్లల చదువు పట్ల ఆతృత వహించిన దానికి అదొక గుర్తు. ఆ మనిఆర్డరు కూపన్‌ను నార్ల చాలా మందికి చూపిస్తూ ఆ విషయాన్ని గురించి మధుర స్మృతిగా చెప్పుతూ భద్రంగా కూపన్ దాచి పెట్టారు. ఆ తరువాత ఒక ప్రదేశం నుంచి మరొక చోటకు ఇళ్ళు మారినప్పుడు కూపన్ పోగా ఆయన చాలా బాధ పడ్డారు. నార్ల వెంకట రామన్న గారు 1935 ఫిబ్రవరి 17వ తేదీన ఖట్నీలో చనిపోయారు. ఆ వార్త తెలిసిన ఆయన మనుమనిపెళ్ళి కూడ తాత్కాలికంగా వాయిదా వేశారు.

కవుతరంలో పనిచేసి వెళ్ళిన చెఱుకువాడ నరసింహం బ్రహ్మసమాజానికి చెందిన వారు. జాతీయవాద ప్రభావంతో కొందరికి శిక్షణ ఇవ్వాలనే దృష్టితో కవుతరంలో ప్రైవేట్ మిడిల్‌స్కూల్ హెడ్మాస్టరుగా పనిచేశారు. ఆయన ప్రభావం గ్రామస్థులపై ఉన్నది. సహజంగా విద్యార్థులపై కూడా అదే పడింది. నార్ల మేనమామ కొల్లి సత్యనారాయణ చౌదరి కూడా బ్రహ్మసమాజవాది. ఆయనను అనుకరించాలని కూడా నార్ల ప్రయత్నించారు. బెంగాల్‌లో పుట్టిన బ్రహ్మసమాజం 19వ శతాబ్దంలో ఆంధ్రపై ప్రభావాన్ని చూపెట్టింది. కందుకూరి వీరేశలింగం వంటివారు బ్రహ్మసమాజస్తులుగా కోస్తా ఆంధ్రలో చాల మందిని బ్రహ్మసమాజవాదులుగా మార్చారు. గుడివాడలో ఈ వాసనలు కొంత వరకు లేకపోలేదు. విగ్రహారాధనను బ్రహ్మసమాజవాదులు నిరాకరించారు. ఏకేశ్వరారాధన వారి ప్రచారంలో ప్రధానమైనది. అప్పటికి అదే చాల అభ్యుదయంగా పరిగణించేవారు. తొలి ప్రభావం నార్లపై కొంతవరకు పని చేసింది. గుడివాడలో

మూడేళ్ళపాటు చదువు పూర్తి చేసుకొని ఆయన ఆర్థిక ఇబ్బందులవల్ల స్కూల్ మాస్టరుగా ఉద్యోగం చేయాలని అనుకొన్నారు. కాని శిక్షణ లేనందున ఉద్యోగం రావడం కష్టం. ఎక్కడైనా ప్రైవేటు స్కూల్‌లో ఉద్యోగం చేసినట్లు ఆధారం ఉంటే ట్రైనింగు స్కూల్‌లో సీటుఇస్తారు. ఈ దృష్టితో గుంటూరు తాలూకాబోర్డు అధ్యక్షుడుగా ఉన్న ప్రకాశరావుగారి ఇంటికి నార్ల వెళ్ళారు. మంగళగిరికి మూడు మైళ్ళ దూరాన ఉన్న ఆయన ఊరికి వెళ్ళి ఆయనను కలుసుకున్నారు. అది ఎండా కాలం. నడిచి వెళ్ళినందున బాగా దాహం అవుతున్నప్పటికి, పట్టివేళ్ళ తడికలు అమర్చుకొని గదిలో కూర్చున్న ప్రకాశరావుగారు ఎందుకొచ్చావని అడగటం తప్ప, కనీసం మంచినీళ్ళయినా ఇవ్వలేదట. శిక్షణ లేందే ఉద్యోగం రాదని చెప్పి పంపించేశారు. జీవితంలో ఆయన అనుకోకుండా మహోపకారం చేశారని నార్ల భావించారు. మద్రాసులో ఆంధ్రప్రభ ఎడిటర్‌గా ఉండగా, అక్కడికి వచ్చిన ప్రకాశరావు గార్ని ఇంటికి తీసుకు వెళ్ళి భోజనం పెట్టి పాత సంఘటన గుర్తు చేసి చెప్పారు. అంతే తప్ప పరామర్శ చేయలేదని ప్రస్తావన తీసుకు రాలేదు.

నార్ల గుంటూరులో 1926లో హిందూకాలేజీ టౌన్ స్కూల్‌లో ఎస్.ఎస్.ఎల్.సి. చదివారు. దుగ్గిరాల రామచంద్రరావుగారు హెడ్‌మాస్టరుగా నార్లను బాగా చూచారు. అక్కడ లైబ్రరీ పురుగుగా మారిన నార్లను ఇంగ్లీషు పండితుడని హెడ్‌మాస్టరు పిలుస్తుండేవారు. అయినా 1927 ఎస్.ఎస్ ఎల్.సి. పరీక్షలో నూటికి 29 మార్కులు తెచ్చుకొని నార్ల ఒక మార్కు తేడాతో ఇంగ్లీషులో ఫేల్ అయ్యారు. హెడ్‌మాస్టరు దుగ్గిరాల రామచంద్రరావుగారు నార్ల గురించి ఎగ్జామినేషన్ బోర్డుకు ఉత్తరం వ్రాస్తూ నార్ల ఇంగ్లీషులో మంచి విద్యార్థనీ, ఒక మార్కు ఇచ్చి పాస్ చేయాలని కోరారు. కాని బోర్డువారు రూల్‌కి విరుద్ధంగా పోలేదు. మొదటి సారి ఎస్.ఎస్.ఎల్.సి. ఫేల్‌అయిన నార్ల రెండవ సారి పాస్ అయ్యారు. గుంటూరులో వుండగా నార్లపై వివేకానంద రచనల ప్రభావం, పరిమితంగా రాజకీయ ప్రభావం కనిపించింది. ఒకసారి ఫేల్ అయినందువల్లనేమో ఆయన గుంటూరులో చదవడం ఇష్టంలేక బయాలజీ గ్రూపుతో ఎఫ్.ఏ. చదవాలనుకొన్నారు. ఆ గ్రూపు గుంటూరులో లేనందున కాకినాడ వెళ్ళవలసి వచ్చింది. మేనమామ వద్ద వుండటం ఇష్టం లేక, ఆ విషయం ఆయనకి చెప్పలేక ఈ విధంగా నార్ల లౌక్యంగా కాకినాడ వెళ్ళారు.

నార్ల కాకినాడ పి.ఆర్. కాలేజిలో ఎఫ్.ఏ.లో చేరినప్పుడు బ్రహ్మసమాజ వాతావరణం బాగా ప్రబలి వున్నది. మహారాష్ట్రలో పుట్టిన ప్రార్థన సమాజం 19వ శతాబ్దం మధ్యలోనే ఆంధ్రకు వచ్చింది. బెంగాల్‌లో రామ్‌మోహన్‌రాయ్ స్థాపించిన సమాజం ముక్క చెక్కలైన తరువాత ఆంధ్రకు చేరింది. ఈ రెండు సమాజాలు కలసి ఆంధ్రలోని కొన్ని ప్రధాన నగరాలలో మేధావులను రచయితలను ప్రభావితం చేశాయి. అందులో కాకినాడ ఒక ప్రధాన కేంద్రముగా పేరు తెచ్చుకుంది. సర్ రఘుపతి వెంకటరత్నంనాయుడు కాకినాడలో పిఠాపురం రాజా కాలేజీకి ప్రిన్సిపాల్‌గా ఉంటూ అనేక మందిని ప్రభావితం చేశారు. సంస్కరణ వాదాన్ని సామాజిక మార్పులను ప్రబోధించిన కాకినాడకు ఇంటర్ విద్యార్థిగా వెళ్ళిన నార్ల, పరిమితంగానే బ్రహ్మసమాజ ప్రభావానికి లోనయ్యారు. నాడు కాలేజీలో ఉపాధ్యాయులు పాండిత్యప్రకర్షను ప్రదర్శించడం, విషయాన్ని క్షుణ్ణంగా చదువుకొని వచ్చి చెప్పడం భిన్న విషయాలలో ఆసక్తి కనపరచడం పేర్కొనదగిన అంశాలు. 1928లో నార్ల కాకినాడలో విద్యార్థిగా చేరేనాటికి గోపరాజు రామచంద్రరావు బాటనీలో జూనియర్ లెక్చరర్‌గా అప్పుడే చేరారు. అతడు తర్వాత 'గోరా' అను పేరుతో ప్రసిద్ధులై ఒక నాస్తిక కేంద్రాన్ని విజయవాడలో స్థాపించి ప్రచారం చేసారు. బాటనీలో సీనియర్ లెక్చరర్‌గా ఉప్పల లక్ష్మణరావు 'సోదర సమితి' కి సలహాదారుగా ఉన్నారు. పెద్దాడ రామస్వామి ఇంగ్లీషు లెక్చరర్‌గా ఉన్నారు. తర్వాత ఆయన ఆ కాలేజీ ప్రిన్సిపాల్ కూడా అయ్యారు క్రమశిక్షణకు రామస్వామిని ఉదాహరణగా చూపేవారు. రఘుపతి వెంకటరత్నంనాయుడు ప్రిన్సిపాల్‌గా విరమించిన తరువాత వేమూరి రామకృష్ణారావు ఆ స్థానంలో కాలేజీ పేరు నిలబెట్టడానికి ప్రయత్నం చేసారు. కాకినాడలో క్లాస్ పుస్తకాల పఠనం కంటే బ్రహ్మసమాజ ప్రచురణలు, ఇతర రచనలు నార్ల బాగా చదవడం అలవాటు చేసుకొన్నారు. కాలేజీ లైబ్రరీని ఎక్కువగా వినియోగించుకున్నారు. పుస్తకాలలోను పత్రికలలోను బొమ్మలు, మంచి వ్యాసాలు విద్యార్థులు చించుకుపోతున్న సమయంలో ఆ పని చేయకుండ శ్రద్ధగా కూర్చొని చదవటం నార్లకు అలవాటయ్యింది. ఇది గమనించిన కాలేజీ లైబ్రేరియన్ ఎప్పుడయినా బయటికి వెళ్ళవలసివస్తే తన స్థానంలో నార్లను కూర్చోబెట్టేవారు. ఇంటర్ విద్యార్థిగా నార్ల చాల చురుకుగా అనేక కార్యకలాపాలలో పాల్గొన్నారు. 'సోదర సమితి' అని ఒక సంఘాన్ని పెట్టడం ప్రముఖ అంశంగా పేర్కొనవచ్చు.

దాదాపు 12 మంది ఈ సమితిలో సభ్యులుగా ఉండేవారు. అందులో కూనపల్లి సుబ్రమణ్యం తరువాత హెడ్‌మాస్టరై మంచి పేరు తెచ్చుకున్నారు. తుమ్మల సత్యనారాయణరావు రిజర్వ్ బ్యాంకులో పెద్ద ఉద్యోగిగా గ్రామీణాభివృద్ధిపై సర్వేచేసి నివేదికలు సమర్పించారు. వాటికి చాలా ప్రశంసలు లభించాయి. ఆయన మంచి ఖ్యాతి తెచ్చుకుంటూ ఉండగా హఠాత్తుగా చనిపోయారు. గూడూరి వెంకటచలం నేషనల్ సీడ్స్ కార్పొరేషన్‌లో పెద్ద ఉద్యోగం చేసి పరిశోధకుడుగా కీర్తి ఆర్జించారు. రామలింగస్వామి ఫార్మాస్యూటికల్స్‌లో గణనీయమయిన సేవ చేసారు. పైడిమర్రి సత్యనారాయణ కూడా ఉండేవారు. ఇలాంటి వారి సహచర్యంలో ఏర్పడిన 'సోదర సమితి'లో నార్ల పనిచేసారు. తుఫాను వస్తే సహాయార్థం సేవలు చేసారు. భోగం మేళాల సందడి ఎక్కువగా ఉన్న ఆ రోజులలో అందుకు వ్యతిరేకంగా వాల్‌పోస్టర్లు తయారుచేసి వినాయక చవితి సందర్భంగా కాకినాడలో నార్ల స్వయంగా మైదాపిండితో రెండు రాత్రిళ్ళు పోస్టర్లు అంటించారు. చుట్టుప్రక్కల గ్రామాలలో అంటరానితనానికి వ్యతిరేక ప్రచారం చేస్తూ, హరిజనవాడల్లో తింటూ, వారి చేతి నీళ్ళు త్రాగుతూ ఆదర్శంగా వ్యవహరించారు. అంతేగాక 'యువజన పత్రిక' అనే పేరిట ఒక వ్రాత పత్రికను ప్రారంభించారు. టర్కీలో కెమాల్‌పాషా చేసిన సంస్కరణల గురించి తెలుసుకొని 'నేనే కెమాల్ పాషానైతే' అనే శీర్షికతో వ్రాత పత్రికలో తొలి వ్యాసం వ్రాసారు. ఇందులో పిలకలు పీకిస్తామని, జంధ్యాలు తెంపిస్తామని, ఇంకా ఇలాంటి సంస్కరణలు ఎన్నో తెస్తానని వ్రాసినట్లు నార్ల చెప్పుకొన్నారు. వ్రాతప్రతి దొరికితే బాగుండును.

కాకినాడలో చదువుతున్న రోజులలో కూడ ఆర్థిక ఇబ్బంది నార్లకు తప్ప లేదు. అయినా ఆ సంవత్సరం (1928) మద్రాసులో భారత జాతీయ కాంగ్రెసు మహాసభ జరుగుతుండగా అక్కడికి వెళ్లాలని నార్ల సంకల్పించుకొన్నారు. ఇంటి నుంచి వచ్చిన డబ్బులో కొంత ఖర్చుల నిమిత్తం తీసుకొని మద్రాసు చేరారు. తెలిసిన వ్యక్తి ఒకరు మధ్య మధ్యలో డెలిగేట్ టికెట్ ఇవ్వగా దానితో లోనికి ప్రవేశించి నాయకులను దగ్గరగా చూచారు. అన్సారి అధ్యక్షత వహించిన ఆ సమావేశాలలో శ్రీనివాస అయ్యంగార్ సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు. గాంధీగారికి అది ఇష్టం లేదు. ఆ తీర్మానం కూడ యువకుడుగా

ఉన్న నార్లపై చాలా ప్రభావాన్ని చూపెట్టింది. అక్కడ అనిబిసెంట్ ఆధ్వర్యాన దివ్యజ్ఞాన సమావేశాలు కూడ జరుగుతుండేవి. వీలైనప్పుడు ఈ థియసాఫికల్ ప్రముఖులైన అనిబిసెంట్, ఆమె అనుచరుడుగా ఉన్న జిడ్డు కృష్ణమూర్తిని దూరంగా నార్ల చూచారు. కాని మద్రాసులో ఆనాడు ఉత్తేజమంతా కాంగ్రెసు నాయకుల వల్లే లభించింది. ఆ సమావేశాల సందర్భంగా అమ్మిన అనేక పుస్తకాలలో డబ్బు పరిమితిని బట్టి కొనగలిగినన్ని కొని నార్ల వెంట తెచ్చుకొన్నారు. పుస్తకాలు కొనే అలవాటు అప్పుడు ఆరంభం కాగా చివరిదాక అది వెన్నాడుతూనే ఉంది. కాకినాడకు తిరిగివచ్చిన నార్ల కాంగ్రెసు నాయకులుగా అప్పటికే పేరు తెచ్చుకొన్న మద్దూరి అన్నపూర్ణయ్యను తరచు కలుసుకొంటూ ఉండేవారు ఆయన సంపాదకత్వంలో "కాంగ్రెసు" అనే పత్రిక ప్రచురింపబడుతుండేది. మద్రాసు సమావేశాన్ని చూచిన నార్ల మరుసటి సంవత్సరం కలకత్తాలో జరిగిన సమావేశాన్ని శ్రద్ధగా అనుసరించారు. అక్కడికి వెళ్ళలేకపోయినా గాంధీగారిదే పై చెయ్యని ఆ సమావేశంలోని తీర్మానాలవల్ల గ్రహించారు. సంపూర్ణ స్వాతంత్ర్యానికి నీళ్ళు వదిలారు. అది చూచి నార్ల ఉద్రేకంతో, ఆవేశంలో తనకు పరిచితులైన మద్దూరి అన్నపూర్ణయ్యకు లేఖ వ్రాసారు. కాంగ్రెసు తీర్మానాన్ని ఖండిస్తూ ఒక సంవత్సరం లోగా పరిపాలనలో ఎక్కువ పాల్గొనే అవకాశం కల్పించాలన్న కాంగ్రెసు ధోరణిని నార్ల విమర్శించారు. 1929 తొలి మాసాలలో అనగా కలకత్తా సమావేశాల అనంతరం వ్రాసిన ఈ లేఖను పేరుపెట్టకుండ ఒక "యువ మిత్రుడి'' ఆవేదన అంటూ 'కాంగ్రెసు' పత్రికలో ప్రచురించారు. అది నార్ల తొలి రచన కావటం, పేరు లేకపోయినా అచ్చులో తను వ్రాసింది చూచుకోవటంతో నార్ల గాలిలో నడిచినట్లు భావించారు. ఆ తరువాత మద్దూరి అన్నపూర్ణయ్య గారి 'కాంగ్రెసు' పత్రికలో 'ఉపేంద్ర, రవీంద్ర' ఇత్యాది మారు పేర్లతో నార్ల కొన్ని రచనలు చేసారు. మొత్తం మీద కాకినాడ విద్యార్థి జీవితం నార్ల రచనలకు నాంది పలికినట్లు భావించవచ్చు. రెండేళ్ళ పాటు బ్రహ్మసమాజ ప్రభావంతో, కాంగ్రెసు రాజకీయాల వాసనతో నార్ల కాకినాడ విద్యార్థి జీవితాన్ని ముగించారు. కాని ఈ ఉత్సాహంలో ఆయన ఎఫ్.ఏ పరీక్ష తప్పారు. ఒక్క తెలుగు మాత్రం పాస్ అయ్యారు. 1930లో తప్పిన నార్ల రెండేళ్ళ తర్వాత గాని మళ్ళీ గుంటూరు ఏ.సి. కాలేజీలో పరీక్షలు వ్రాసి పాస్‌కాలేకపోయారు.

కాకినాడ నుంచి కవుతరం వచ్చేసారు. అక్కడ నుండి వ్యాసరచన ప్రారంభించారు. 'భారతి' కి ఒక వ్యాసం పంపిస్తే అచ్చయింది. గన్నవరపు సుబ్బరామయ్య ఆప్పటిలో 'భారతి'కి సంపాదకులుగా ఉండేవారు. ఆ రోజులలో వ్యాసానికి 25 రూపాయలు ఇచ్చేవారని 'భారతి'ని గురించి ప్రతీతి ఉండేది. కాని నార్లకు ఎన్నాళ్ళున్నా డబ్బురాకపోయేసరికి నార్ల మధనపడి పత్రికా సంపాద కులకు లేఖ వ్రాసాడు. తనకు డబ్బు ఏమీ రాలేదని, చిన్నవాడిని కనుక ఇవ్వ నక్కరలేదని అనుకున్నారో ఏమో తెలియదని. కనీసం 'భారతి' మాసపత్రికను ఒక సంవత్సరం పాటు ఉచితంగా పంపించ వల్సిందిగా కోరారు. తరువాత 25 రూపాయలు మనిఆర్డరు వచ్చింది. ఆ రోజులలో ప్రాథమిక ఉపాధ్యాయుని నెల జీతం ఏడు రూపాయలు ఉండేవి. అయితే రూపాయి విలువ కూడ చాల ఎక్కువ. అలాంటిది ఉపాధ్యాయుడికి వచ్చే నెల జీతానికి మూడు రెట్లు ఒక్క వ్యాసానికి రావడం చూచి నార్ల తల్లి మహలక్ష్మమ్మ సంబరపడిపోయింది. ఆ తరువాత బందరులో 'కృష్ణాపత్రిక'కు, బెజవాడలో 'ప్రజామిత్ర'కు తరచు వ్యాసాలు పంపుతూ ఉండేవారు. అయితే కృష్ణాపత్రిక డబ్బు ఇచ్చేది కాదు. వ్యాసాలను మాత్రం సంపాదకులు ముట్నూరి కృష్ణారావు బాగా ప్రచురించేవారు.

ఆంధ్రలో కాంగ్రెసు పార్టీలోనే అతివాద ముఠా ఒకటి పని చేస్తుండేది వారి రహస్య కార్యకలాపాలు కొన్ని కేంద్రాలకు కొందరు వ్యక్తులకు పరిమితంగా ఉండేవి. నార్లకు ఎలాగో వీరితో పరిచయం ఏర్పడింది. వారి కార్యకలాపాలలో పీరు భాగం పంచుకున్నారు. అదే సందర్భంలో ఆయన ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. పట్టాభి సీతారామయ్య నడుపుతున్న 'జన్మభూమి' ఇంగ్లీషు పత్రికలో మొదటి ఇంగ్లీషు వ్యాసం వ్రాసారు. కవుతరంపై పోలీసు అధికారులు ఉప్పు సత్యాగ్రహం సందర్భంగా దాడి చేసినప్పుడు నార్ల ఇంటిని కూడ సోదా చేసారు. 'జన్మభూమి'లో ప్రచురితమైన వ్యాసం తప్ప మరేమీ దొరకలేదు. ఆ వ్యాసంలో తెల్లివారిని అల్లుళ్ళుగా చిత్రించి నార్ల ఒక వాదన లేవనెత్తారు. ఇండియాలో బ్రిటీషు పాలన సాగితే దేశీయులకు తెల్లివారికి పుట్టే ఆంగ్లో ఇండియన్ల సంతతి ఎక్కువై పోతుందన్నారు. నార్ల ఇంటిపై దాడి చేసి సోదా చేసిన హేమిల్టన్, అసిస్టెంటు పోలీస్ సూపరింటెండెంట్, పట్టుబడిన నార్ల వ్యాసాన్ని చదివి ఆగ్రహించి అందుకు ఆధారాలు ఏమిటని నార్లను అడిగారు. మేజర్ బి.డి. బసు వ్రాసిన 'కన్సాలి

డేషన్ ఆఫ్ ది క్రిస్టియన్ పవర్ ఇన్ ఇండియా' అనే గ్రంథంలోని మూలాధారాలను చూపారు. హేమిల్టన్ ఆ పుస్తకాన్ని చించేసి బూటు కాళ్ళతో తన్ని, నార్లను ఇద్దరు మలబారు పోలీసులకు అప్పచెప్పారు. వారు ఊరు వెలుపలకు తీసుకువెళ్ళి స్పృహ తప్పేవరకు నార్లను కొట్టారు. ఎప్పుడో స్పృహ వచ్చిన తరువాత ఎలాగో పడ్తూ లేస్తూ నార్ల ఇంటికి చేరుకొన్నారు. అంతే తప్ప గ్రామంలో వారు గాని, దగ్గర బంధువులు గాని నార్లకు చేయూతనివ్వడానికి భయపడ్డారు. అయినా నార్ల ఊరుకోక మూడువేల ఒక వంద నష్టపరిహారంగా చెల్లించాలని హేమిల్టన్‌కు, సర్కిల్ ఇన్స్‌పెక్టరు దావూద్‌ఖాన్‌కు రిజిష్టరు నోటీసు ఇచ్చారు. ఈ విషయంలో కృష్ణాపత్రిక సంపాదకులు ముట్నూరి కృష్ణారావు మచిలీపట్నం డాక్టరు అహోబలరావు నార్లను ప్రోత్సహించారు. కాని పోలీసులు సారాయి కొట్టు వద్ద పికెటింగ్ చేస్తున్నందుకు అరెస్టు చేసిన నార్లపై కేసు పెట్టారు. ఈ కేసు విచారణ పామర్రులో జరిగేది. తనకు హామీ ఉన్న వారితో సహా ప్రతిసారీ అక్కడికి వెళ్ళారావడం ఆర్థికంగా నార్లకు చాల బాధాకరంగా ఉండేది. మేజిస్ట్రేట్ ప్రతిసారి విచారణకు హామీదార్లను కూడా తీసుకురావాలని కోరేవాడు. ఈ విషయంపై అభ్యంతరం పెడుతూ జిల్లాకోర్టుకు, హైకోర్టుకు నార్ల అపీలు చేసుకొన్నారు. హామీదారులు ఒకసారి ఇచ్చిన బాండ్ పట్ల న్యాయస్థానం తృప్తి వహిస్తే మళ్ళీ వారు కోర్టుకు రావలసిన అవసరం లేదని హైకోర్టు తీర్పు చెప్పింది. పామర్రునుండి నార్ల కేసును బెజవాడకు మార్చారు. అక్కడ విచారణ తరువాత ఏడు మాసాల కఠిన శిక్ష విధిస్తూ నార్లకు జైల్లో 'సి' తరగతి కేటాయించారు. రెండురోజుల అనంతరం నార్ల బెయిలుపై విడుదలయ్యారు. ఈలోగా ఎంతో రాజకీయ ప్రాధాన్యత గల గాంధీ-ఇర్విన్ ఒడంబడిక వచ్చింది. ఆ సందర్భంగా నార్లపై కేసును ఉపసంహరించారు. ఈ కాలంలోనే "స్వతంత్రభారత్" అనే అండర్‌గ్రౌండు పత్రికకు నార్ల వ్యాసాలు వ్రాసారు. ఈ పత్రికకు స్నేహితులు ఆర్థిక సహాయం చేయగా సైక్లోస్టయిల్ చేసి ఖద్దరు సంచిలో పెట్టుకొని అనుమానించకుండా ఉండడానికి పోలీసు స్టేషను ముందే అటూ ఇటూ తిరుగుతూ పత్రికలను నార్ల పంచి పెట్టేవారు. ఈ పత్రికను దగ్గరుంచుకొంటేనే నేరంగా భావించి అరెస్టు చేసేవారు. ఇది కమ్యూనిస్టు పార్టీ పత్రిక. దీనిని ప్రభుత్వం నిషేధించింది.

ఈ విధంగా ఇంటర్మీడియట్ తప్పి (ఎఫ్.ఏ) 1932 లో మళ్ళీ పాసయ్యే వరకూ అడపాదడపా రచనలను సాగిస్తూ అతివాద కార్యకలాపాలలో పాల్గొంటూ

నార్ల మచిలీపట్నం చేరారు. అక్కడ బి.ఏ చదవాలని నోబుల్ కాలేజీలో చేరారు. అయితే వ్యాసాలు వ్రాయటం మానలేదు. నార్లతోపాటు ఆయన సోదరులు గౌరీశంకర్, నార్ల తాతారావు చదువుకొంటూ ఉండేవారు. ముగ్గురూ కలసి ఒక గది తీసుకొని హోటలు నుండి కారియర్ తెప్పించుకొని భోజనం చేస్తూ చదువుకునే వారు. నోబుల్ కళాశాల ప్రిన్సిపాలుగా జాన్‌స్టన్ ఉండేవారు. ఆయన నార్ల పట్ల ఒక స్నేహితుడిగా అభిమానం చూపి ఆదరించేవారు. బందరులో ఉండగా కూడ నార్ల కాలేజీ చదువుకంటే ఇతర వ్యాసంగాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చారు. యూనివర్శిటీ పరీక్ష ఫీజు సకాలంలో కట్టనందుకు ఆయన్ని కాలేజీవారు నిలిపి వేశారు. జాన్‌స్టన్ దగ్గరకు వెళ్ళగా వెంకటేశ్వరరావు అనే పేరుతో ఎక్కువ మంది ఉండడం వల్ల ఇలా జరిగిందని చెప్పి డిటేన్ అయిన మిగిలిన వారు వత్తిడి చేయకుండా ఉండే నిమిత్తం తాలూకా ట్రెజరీ ఆఫీసులో ఫైన్‌తో ఫీజు కట్టమని చెప్పారు. నార్ల ఆ పని చేసి బి.ఏ. పరీక్షను వ్రాసి మూడో తరగతిలో పాసు అయ్యారు. నార్ల పట్ల అభిమానం గల జాన్‌స్టన్ అదే ఫస్ట్‌క్లాసుగా భావించి సంతోషించారు. ఆ మరుసటి సంవత్సరం జాన్‌స్టన్ రిటైర్ అయ్యి ఇంగ్లండు వెళ్ళి పోతుండగా చేప ఆకారంలో గల ఒక వెండి వస్తువును నార్ల ఆయనకు బహూకరించి తన అభిమానాన్ని వ్యక్తం చేసుకొన్నారు.

బందరులో బి.ఏ. పూర్తి అయింది. బెనారస్ వెళ్ళి ఎం.ఏ, చదవాలని ఆశ ఉన్నా ఆర్థిక స్థోమత లేదు. కనుక మళ్ళీ స్వగ్రామం కవుతరం చేరుకొన్నారు. తరచు బందరు వస్తూ పోతుండేవారు. వ్యాసాలు వ్రాయటం, వ్యక్తులను కలుసు కోవటం జరుగుతూనే ఉంది. బందరులో ఉండగా తెలుగు గ్రంథ రచన చేసారు. అందువల్ల అచ్చువేసుకోవడానికి స్నేహితులు తలా ఒక పది రూపాయలూ సహాయంగా ఇచ్చారు. మొత్తం 100 రూపాయలతో 'స్వదేశీ సంస్థానాలు' అచ్చయింది. ఆరునెలల్లో వెయ్యి కాపీలు అమ్ముడు పోయాయి. ముట్నూరు కృష్ణారావు గారి వద్దకు వెళ్ళి తెలుగు పుస్తకాన్ని ఇవ్వగా ఆయన చదవటమే కాక సంపాదకీయ సమీక్ష వ్యాసంగా వ్రాసారు. పుస్తకంపై ఖర్చులు పోగా నూట యాభై రూపాయలు మిగిలాయి. తరువాత 'నేటి రష్యా' అనే పుస్తకం వ్రాస్తే మొదటి పుస్తకం వలె దీనికి కూడ డబ్బు మిగుల్తుందని అనుకొని చెల్లెలు గాజులు అమ్మివేసి పుస్తకం అచ్చు వేయించారు. ఇది 104 పుటల పుస్తకం. 1934 జులైలో

కవుతరం నుంచి దీనిని ప్రచురించారు. జీవితం అంతా ఆర్థికంగా సహాయపడిన ఖమ్మిలోని వెంకటరామన్న పెదనాయన గారికి దీనిని అంకితం ఇచ్చారు. కానీ నెల తిరగక ముందే ప్రభుత్వం ఈ పుస్తకాన్ని నిషేధించింది. ఈ పుస్తకానికి ముందు 'నేటి రష్యా' శీర్షికను 'భారతి'కి ఆరు వ్యాసాలు పంపిస్తే అచ్చువేసి వంద రూపాయలు కూడ ఇచ్చారు. బెజవాడ నుంచి గూడవల్లి రామబ్రహ్మం నడిపే 'ప్రజామిత్ర' కు వ్యాసాలు వ్రాస్తే అచ్చు అయిన దానికి 5 రూపాయల చొప్పున పంపుతుండేవారు. నార్లగారి పెదనాయన నార్ల వెంకటరామన్న, 1935 ఫిబ్రవరిలో చనిపోయారు. కనుక ఆర్థిక సహాయం చేసే వ్యక్తి కూడ లేకుండా పోయారు. అప్పటికే స్వయంగా ఆర్జించాలనే ధోరణి నార్లలో ప్రబలింది కవుతరంలో ఉండలేకపోయారు. ఏమీ తోచేది కాదు. అలాంటప్పుడు బందరు నుండి 'ప్రభ' అనే పత్రికను నడపాలని గద్దె లింగయ్య తలపెట్టారు. ఆ పత్రిక నిర్వహణకు 1935 ఏప్రిల్ 19 న నార్ల అంగీకరించారు. మే 1వ తేదీన 'ప్రభ' తొలి సంచిక పూర్తిచేసి మే 3 న బందరులో విడుదల చేసారు. ఆ తరువాత మే 15 న ప్రభ మరో సంచిక వారం లోపల మే 20న పూర్తి చేసారు. మద్రాసు నుండి వెలువడే 'ప్రజాబంధు' పత్రిక ప్రభను గురించి చక్కగ వ్రాసింది. అయితే నార్లతో మాట్లాడుకొన్న రీతిలో గద్దె లింగయ్య డబ్బు చెల్లించక పోవడంతో 'ప్రభకు' పనిచేయడం మానెయ్యాలని నిర్ణయించుకొని 1935 మే, 29న గద్దె లింగయ్యకు గుడ్‌బై చెప్పారు.

బందరు నుండి 'జ్యోతి' అనే మరో పత్రిక వెలువడబోతుండగా దానికి సంపాదకత్వం వహించటానికి నార్ల అంగీకరించారు. అంతకు ముందే 1935 ఏప్రిల్ 7 న కవుతరం వచ్చిన తన స్నేహితులను తల్లి సరిగా చూడలేదన్న దృష్టితో ఇక కవుతరంలో ఉండకూడదని నిర్ణయించుకొని ఊరు వదిలి బందరు వచ్చేసారు. ఏప్రిల్ 26 న 'జ్యోతి' సంపాదకత్వం అంగీకరించి మే 23వ మొదటి ఫారం పూర్తిచేసారు. జూన్ 8 కల్లా పత్రికను పూర్తిచేసి మార్కెటుకు విడుదల చేసారు. కాని ఆ పత్రికవారుకూడ నార్లపట్ల సరిగా ప్రవర్తించకపోవటంతో 'జ్యోతి' సంపాదకత్వాన్ని కూడ వదిలేసారు. (11 జూన్). ఈ విధంగా ఒకే సంవత్సరంలో వేసవి కాలంలో 'ప్రభ', 'జ్యోతి' అనే పత్రికలలో ప్రవేశించి, వదిలివేసి, బందరు కూడ తనకు సరియైన చోటు కాదని నిర్ణయించుకొన్నారు.

ఇంగ్లీషు జర్నలిజం పట్ల మొదటి నుండి నార్లకు ఆసక్తి ఉండేది. పట్టాభి సీతారామయ్య సంపాదకత్వాన వెలువడే 'జన్మభూమి' పత్రికకు వ్యాసాలు పంపించే వారు. అందులో అచ్చు కావడం చూచి లాలాలజ్‌పతి రాయ్ స్థాపించిన లాహోర్ లోని పత్రికకు, పూనా నుండి తిలక్ స్థాపించిన 'మరాఠా' పత్రికకు వ్యాసాలు పంపగా అచ్చయ్యాయి. బందరులో ఉండగా అడవి బాపిరాజు, ముద్దుకృష్ణలతో స్నేహం ఉండేది. బెజవాడలో వీరు కలుసుకొని మాట్లాడుకొంటూ ఉండేవారు. ఆ తరువాత అప్పుచేసి ఢిల్లీ వెళ్ళి 'హిందూస్థాన్ టైమ్స్'లో చేరాలని విఫల ప్రయత్నం చేసారు. కవుతరంలో సీతారామ్, పామర్రులో వీరయ్య నార్లకు అప్పుడప్పుడూ డబ్బు సహాయం చేసేవారు.

బందరులో ఉండగా తరచు 'కృష్ణాపత్రిక' ఆఫీసుకు వెళ్ళడం నార్ల కార్యక్రమంలో ఒకటిగా పేర్కొనడం జరిగింది కదా! అప్పట్లో ఓడలు బందరు వరకూ వచ్చేవి. ఇండియానుండి సరుకులు తీసుకువెళ్ళి ఇంగ్లాండ్‌నుండి తిరిగి వచ్చేటప్పుడు ఓడకు తగినంత బరువు నిమిత్తం పాత పేపర్ల కట్టలు వేసేవారు. ఆ విధంగా బందరుకు చేరిన పాత పత్రికలు పచారి కొట్లలో చోటుచేసుకొన్నాయి. వీటిలో డెయిలీ మేల్, అబ్జర్వర్, ఓవర్‌సీస్ వీక్లీ మొదలైన పత్రికలు ఉండేవి. ఓడ వచ్చినప్పుడు పచారి కొట్టు వెతికి పత్రికలను నార్ల కొనుక్కుంటూ ఉండే వారు. ఒక సందర్భంలో ఇలాంటి పత్రికలను చేతపట్టుకొని ముట్నూరి కృష్ణారావు గారి దగ్గరకు వెళ్ళి మాట్లాడిన అనంతరం పత్రికను అక్కడ మర్చిపోయి నార్ల వచ్చేసారు. అంతకు ముందు ఇంగ్లీషు పత్రికలలో చదివిన వ్యాసాలు తర్వాత వారాల్లో కృష్ణాపత్రికలో వచ్చాయి. ముట్నూరి కృష్ణారావు గారు ఈ విషయాన్ని ధ్రువపరుస్తూ నీవు వదిలిపెట్టి వెళ్ళిన పత్రికలను సద్వినియోగం చేసుకొన్నానని నార్లతో చెప్పారు. కృష్ణాపత్రికకు కొన్నాళ్ల కోట సుబ్బారావు గారు ఇన్‌ఛార్జ్ ఎడిటర్‌గా ఉండగా వింతలు-విశేషాలు వ్రాసినందుకు నార్లకు నెలకు 5 రూపాయలు జీతం ఇచ్చేవారు. విశ్వనాథ సత్యనారాయణ సోదరుడు కూడ పత్రిక నిర్వహణలో తోడ్పడుతూ వేసవి సెలవులలో ఒకసారి నార్లను ఆక్టింగ్ ఎడిటర్‌గా పెట్టి 30 రూపాయలు ఇచ్చారు.

బందరు వదిలి మద్రాసు వెళ్ళాలని నిర్ణయించుకున్న నార్ల 1935 జూన్ 27 న ఎన్. జి. రంగాకు, భూషయ్య చౌదరికి తన కోరికను వెల్లడిస్తూ

ఉత్తరాలు వ్రాసారు. రంగా వెంటనే సమాధానం వ్రాస్తూ 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' ఎడిటర్ సంతానానికి వ్రాసానని తెలియజేయగా నార్ల సంతోషించారు. ఈలోగా మరోసారి కవుతరం వెళ్ళిన నార్ల ఆ ఊర్లో ఉండరాదని దృఢ నిశ్చయానికి వచ్చారు. 1935 జులై 1న ఎం. చలపతిరావు బందరులో తన ఫోటో తీసినట్లు అది చాలా బాగా వచ్చినట్లు నార్ల చెప్పుకొన్నారు తెలుగు పత్రికల జాబితాను (పీరియాడికల్స్‌తో సహా) సిద్ధంచేసి జులై 4 న కృష్ణా పత్రికకు ఇచ్చారు. నార్ల బందరు విడిచి మద్రాసు వెళ్ళిపోతున్నాడని తెలిసి జాతీయ కళాశాల విద్యార్థులు ఆయనకు వీడుకోలు పార్టీ ఇచ్చారు. ఈ విషయంలో ఆశ్చర్యపోయిన నార్ల ఆనాడు 28 జులై 1935 విద్యార్థులతో తీయించుకొన్న ఫోటోను భద్రంగా దాచుకొన్నారు అంతకు ముందు కవుతరం పోవడానికి బస్సు ఛార్జీలు లేక బాధలు పడడం వల్ల ఎలాగో తిప్పలు పడి 1935 జులై 30 న మద్రాసు చేరుకొన్నారు. జీవితంలో నార్లకు పెద్దమలుపు అదే.

ఏమైనా సరే, జీవితంలో జర్నలిస్టుగా స్థిరపడాలని పట్టుదల వహించిన వి. ఆర్. నార్ల 1935 జులై 30 న మద్రాసు చేరగానే, "ప్రజాబంధు" నిర్వహిస్తున్న ఎస్. జి. ఆచార్య ఆప్యాయంగా ఆయనకు స్వాగతం పలికారు. 'ప్రజాబంధు' పత్రికకు బందరు నుండి కూడా నార్ల వ్యాసాలు వ్రాసినా ఆచార్యను కలుసుకోవటం అదే ప్రథమం. శ్రీ ఎస్. జి. ఆచార్య స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న జర్నలిస్టు. ఆయనకు సంతానం లేదు. ఆయన భార్య అన్నపూర్ణా దేవి చేదోడు వాదోడుగా ఉంటూ అన్ని విధాలా సహకరించేవారు. శ్రీ ఆచార్య మద్రాసులో నార్లకు పెద్ద అండగా నిలిచి అనేక సంధర్భాలలో ఆర్థికంగా కూడా ఆదుకున్నారు.

మద్రాసు వెళ్ళిన మరునాడే నార్ల "ఇండియన్ ఎక్స్‌ప్రెస్' సంపాదకుడు సంతానంను కలియగా ఆయన ఏవో కబుర్లు చెప్పి నార్లకు ఉద్యోగం ఇవ్వడానికి నిరాకరించాడు. అప్పటినుండి 'ఆంధ్రప్రభ'లో చేరే వరకూ సుమారు నాలుగేళ్ళ పాటు నార్ల ఆర్థికంగా ఇబ్బందులు పడుతూ, జర్నలిజాన్ని మాత్రం వదలకుండా కొనసాగించారు. ప్రజాబంధు, సమదర్శిని, భారతి, వినోదిని పత్రికలకు తరచు వ్యాసాలు వ్రాయడం, వారిచ్చే డబ్బుతో కాలక్షేపం చేయడం నార్ల మద్రాసు జీవితంలో ఒక ప్రధానాంశమైంది.

1935 ఆగస్టు 1 న 'ఆంధ్రపత్రిక' కార్యాలయంలో శివలెంక శంభు ప్రసాద్‌ను కలుసుకోగా ఆయన నార్లను, పండితారాధ్యుల నాగేశ్వరరావుకు పరిచయం చేసి, 'భారతి'కి తరచు వ్రాస్తుండమనీ, అందుకు తగిన పారితోషికం ఇస్తామనీ చెప్పారు. 'ప్రజాబంధు' పత్రికలో వ్రాస్తున్న శ్రీనివాస శిరోమణితో కూడా నార్లకు పరిచయమైంది. శిరోమణి గంటల తరబడి మాట్లాడినా విసుగు పుట్టేది కాదని, ఆ విధంగా మాట్లాడ గలగడం ఒక విశేషమని నార్ల భావించాడు.

ఉద్యోగ అన్వేషణలో నార్ల, మద్రాసు శాసనమండలి సభ్యుడుగా ఉన్న పాములపర్తి వేంకటకృష్ణయ్య చౌదరి వద్దకు వెళ్ళి తన విషయం చెప్పుకోగా ఆయన నార్లను జస్టిస్ పార్టీ కార్యాలయానికి తీసుకు వెళ్ళారు అక్కడ రామ స్వామి మొదలియార్‌తో పరిచయం చేశారు. 'జస్టిస్' పత్రిక సంపాదకుడు నాధన్ ఇంటర్వ్యూ చేసి నార్లను ఉద్యోగంలోకి ప్రవేశపెట్టారు. 'సమదర్శిని' పత్రికలో నెలకు 20 రూపాయల చొప్పున పార్ట్‌టైమ్ పని చేయటానికి 1935 అక్టోబరు 1 నుండి నార్ల అంగీకరించారు. కాని 'జస్టిస్' పత్రికలో అట్టే కాలం నార్ల ఉండలేక పోయారు. లోగడ టెర్రరిస్టుగా ఆయనపై రికార్డు ఉన్నందున, ప్రభుత్వ సి.ఐ.డి ఒకరు రోజూ జస్టిస్ పార్టీ ఆఫీసుకు వచ్చి కూర్చునేవారు. అంతేగాక నార్లను తొలగించమని ఒత్తిడి కూడా ప్రభుత్వపరంగా వచ్చింది. ఆ ఒత్తిడికి లొంగి పోయిన జస్టిస్ పార్టీవారు నార్లను ఉద్యోగం నుండి తొలగించారు.

అప్పట్లో త్రిపురనేని గోపీచంద్ పచ్చయప్ప కాలేజీ హాస్టల్లో ఉండేవాడు. 1935 సెప్టెంబరు 26 న మొదటిసారి నార్ల, గోపీచంద్ కలుసుకున్నారు. అప్పటి నుండీ వారిరువురూ తరచు కలుసుకొని మట్లాడుకోవటం, స్నేహితులుగా పెంపొందటం జరిగింది.

మల్లంపల్లి సోమశేఖరశర్మ 1936 జనవరి 31 న నార్లను వెంటబెట్టుకొని ఖాసా సుబ్బారావు వద్దకు వెళ్ళారు. 'స్వరాజ్య' పత్రిక సంపాదకుడుగా ఉన్న శ్రీ సుబ్బారావు ఖాళీలు వచ్చినప్పుడు ఉద్యోగం ఇస్తానని నార్లకు హామీ ఇచ్చాడు. తొలి పరిచయం వలన ఖాసా సుబ్బారావు పట్ల నార్లకు మంచి అభిప్రాయం ఏర్పడింది. ఉద్యోగాన్వేషణ చేస్తూనే నార్ల మద్రాసులో ఎన్. జి. ఆచార్య దంపతులతోనూ, చందూర్, కంభంపాటి సీనియర్, శ్రీనివాస శిరోమణి, పండితా

రాఘ్యుల నాగేశ్వరరావు, నీలంరాజు వేంకట శేషయ్య, కాటూరు వేంకటేశ్వరరావు, బాపిరాజు, గూడవల్లి రామబ్రహ్మం మొదలైన వారిని తరచు కలుసుకొని పరిచయాలు పెంచుకున్నారు. ఒక్కొక్క సందర్భంలో భోజనానికి కూడా డబ్బు లేకపోవటం, పత్రికలలో వ్రాసిన వ్యాసాలకు సమయానికి డబ్బు అందక పోవడం,పస్తులుండటం నార్ల జీవితానుభవాలలో, కొన్ని దశలుగా పేర్కొనవచ్చు.

'స్వరాజ్య' పత్రికలో సబ్-ఎడిటర్‌గా ఉద్యోగం ఇచ్చే విషయమై పరిశీలిస్తామని యాజమాన్య వ్యవహారాలు చూస్తున్న క్రొవ్విడి లింగరాజు 1936 ఫిబ్రవరి 5న నార్లకు చెప్పారు. అప్పటికే ఆ పత్రికలో కంభంపాటి సీనియర్ విలేఖరిగా పని చేస్తున్నారు. ప్రకాశం పంతులు నిర్వహించే 'స్వరాజ్య' పత్రిక ఆర్థిక ఇబ్బందులకు లోనై అవసాన దశలో ఉన్న స్థితి అది. అలాంటి సందర్భంలో 1936 ఫిబ్రవరి 25న నార్ల 'స్వరాజ్య' పత్రిక ఉపసంపాదకుడిగా చేరారు. అప్పుడు నగర స్టాంప్ మోసపు కేసు విచారణ హైకోర్టులో జరుగు తున్నది. పాఠకులకు ఉత్సాహం కలిగించే ఈ కేసును రిపోర్టు చేయమని నార్లను పురమాయించారు. రిపోర్టర్‌గా ఎలాంటి అనుభవం లేని నార్ల ప్రతిరోజు హైకోర్టుకు వెళ్ళి, కపిల కాశీపతి సహాయంతో రిపోర్టు ఎలాగో కష్టపడి తయారు చేశారు. విషయం బాగా సమర్పించినట్లు అభినందనలు వచ్చాయి. సంపాదకుడిగా ఉన్న ఖాసా సుబ్బారావు నెలకు 15 రోజుల పాటు ప్రూఫ్ రీడింగ్ చేయమని, కొన్నాళ్ళు రాత్రిళ్ళు ఎడిటర్‌గా డ్యూటీ చేయమని పురమాయించారు. ఆ విధంగా ఖాసా సుబ్బారావు సంపాదకత్వాన నార్ల వివిధ జర్నలిస్టు రంగాలలో అనుభవం పొందారు. రాత్రి డ్యూటీలో పది మొదలు 3 గంటలవరకు కష్టపడి పని చేసేవారు. ఖాసా సుబ్బారావుకు వీరు బాగా సన్నిహితులయ్యారు. అయితే 'స్వరాజ్య పత్రిక' వారు చెల్లించే డబ్బు చాలక యథావిధిగా ఇతర పత్రికలకు వ్యాసాలు వ్రాస్తుండే వారు. 1936 ఏప్రిల్ 16న ఆంధ్రపత్రిక వారపత్రికకు తొలిసారి వ్యాసం వ్రాసినట్లు నార్ల పేర్కొన్నారు. అప్పుడు దానికి నీలంరాజు వెంకట శేషయ్య తాత్కాలిక సంపాదకులుగా ఉన్నారు.

'స్వరాజ్య' పత్రికలో సంక్షోభం పెరిగిపోగా, 1936 మే 5న ఖాసా సుబ్బారావు సంపాదకులుగా రాజీనామా ఇచ్చాడు. ఆ రోజు 6 పేజీల పత్రికను నార్ల, లక్ష్మీనరసింహం కలిసి బయటికి తీసుకురాగలిగారు. మే 10వ తేది లోపల

'యిలన్నీ చెల్లిస్తానని టంగుటూరి ప్రకాశం పంతులు హామీ ఇచ్చారు. ఆ మరు
ి శ్రీ ఖాసా సుబ్బారావు మళ్ళీ వచ్చి చేరాడు. హామీ ఇచ్చిన ప్రకారం మే
న బకాయిలు చెల్లించకపోగా మే 11న క్రొవ్విడి లింగరాజు భోజనం నిమిత్తం
ర డబ్బులు కొంత నార్లకు ఇవ్వజూపారు. తన బకాయీలు ఇచ్చేవరకు ఆఫీ
కు రానని నార్ల వెళ్ళిపోయారు. మే 18వ తేదీ లింగరాజును కలుసుకోగా అతడు
ి చేతులే చూపాడు. నార్ల పాత పేపర్లు అమ్మి వచ్చిన డబ్బుతో గడుపవలసి
్చింది. అంతకు ముందు రోజు (మే 17, 1936) నార్ల రోజంతా భోజనం
కుండా పస్తులున్నారు. మే 20వ తేదీ 'స్వరాజ్య' ఆఫీసుకు వెళ్ళి లింగరాజును
ద్దేశించి ఇష్టం వచ్చినట్లు మాట్లాడేసరికి ఆయన నార్లకు రెండు రూపాయలిచ్చి
ంపించారట. మే 25న నార్ల మళ్ళీ 'స్వరాజ్య'లో చేరారు. జూన్ 1న కొంత
బ్బు ఇస్తానని ప్రకాశం పంతులు హామీ ఇచ్చి మాట నిలబెట్టుకోలేక పోయారు.
మరునాడే ప్రకాశం పంతులు కుమారునితో కలహం రాగా, లింగరాజు రాజీ
నామా ఇచ్చి వెళ్ళిపోయాడు. తరువాత 'స్వరాజ్య' పత్రికవారు అడపదడప కొద్దో,
ొప్పో నార్లకుచెల్లిస్తూ పోయారు. 1936 జులై 1న 'స్వరాజ్య' పత్రికలో సమ్మె
రుగగా, పి. వేంకటేశ్వర శాస్త్రులు అనే అతను ఎలాగో కష్టపడి పత్రికను
యటికి తెచ్చారు.

పిఠాపురం రాజా నడపదలచిన తెలుగు దినపత్రిక 'జనవాణి'లో
ద్యోగం నిమిత్తం నార్ల దరఖాస్తు పెట్టుకున్నారు. జస్టిస్ పార్టీ చీలిపోయి,
ప్రుల్స్ పార్టీ అని పెట్టిన పిఠాపురంరాజా రానున్న ఎన్నికలను దృష్టిలో
పెట్టుకొని పత్రికను ప్రారంభించ దలిచారు. పీపుల్స్ పార్టీ పత్రికకు తాపీ
ధర్మారావును సంపాదకుడిగా నియమించారు. నార్లను రెండు పర్యాయాలు
పిలిచి, ఇంటర్వ్యూ చేసి, పి. నారాయణస్వామి నాయుడు నార్లను నెలకు 65
రూపాయలు చొప్పున అసిస్టెంట్ ఎడిటర్‌గా నియమించారు. నార్ల సిఫారసుపై
పండితారాధ్యుల నాగేశ్వరరావును కూడా 'జనవాణి'లో నియమించారు. 1936
జులై 29 న పిఠాపురం యువరాజు పత్రికా కార్యాలయానికి ప్రారంభోత్సవం
చేశాడు.

1936 ఆగస్టు 1 న 'జనవాణి' దినపత్రిక డమ్మీ ఎడిషన్ వేసి చూచారు
ఆగస్టు 5 నుండి 12 పేజీలతో పత్రికను వెలువరించారు. కానీ సెప్టెంబరు

22 నాటికే పత్రికా కార్యాలయంలో జరిగిన కుట్ర వలన 'జనవాణి' పత్రిక ఆగిపోయింది. మళ్ళ అక్టోబర్ 3 నుండి పది పేజీలతో 'జనవాణి' వెలువడింది. ఆ తరువాత జరిగిన శాసన సభ ఎన్నికలలో జస్టిస్ పార్టీ, పీపుల్స్ పార్టీ పూర్తిగా ఓడిపోగా, 'జనవాణి' పత్రిక కూడా ఆగిపోయింది. మళ్ళీ నార్ల ఉద్యోగాన్వేషణ పర్వంలో ప్రవేశించాడు. మళ్ళీ పత్రికలకు వ్యాసాలు వ్రాసుకోవడం, వచ్చిన డబ్బుతో సరిపెట్టుకోవడం, అప్పులు చేయడం, స్నేహితులనుండి తెప్పించుకోవడం ఆనవాయితీ అయింది.

'ప్రజామిత్ర' తెలుగువారపత్రిక ఎడిటర్ ఇన్‌చార్జీగా నెలకు 75 రూపాయల జీతంతో నార్ల 1938 జులై ఆఖరు వరకూ పనిచేశాడు.

# ఆంధ్రప్రభ సహాయ సంపాదకులు

1938 ఆగస్టు 1 న శ్రీ నార్ల ఆంధ్రప్రభలో సబ్‌ఎడిటర్‌గా చేరాడు. స్టు 15 న (1938) ఆంధ్రప్రభ మదరాసు నుంచి దినపత్రికగా ప్రారంభ ుంది. జులై మాసంలో ఖాసా సుబ్బారావు నార్లను వెంటబెట్టుకొని రామనాథ్ యంకా ఇంటికి తీసుకువెళ్ళారు. నెలకు 75 రూ. జీతంతో ఆంధ్రప్రభ ఎడి ్గా పనిచేయమన్నారు. అయితే సంపాదకుడిగా ఖాసా సుబ్బారావు పేరు ంటుందనీ, ఆయనకు ఉన్న ప్రతిష్ఠ వలన ఆ ఏర్పాటు చేస్తామనీ చెప్పారు. ఖాసా రే సంపాదక కార్యాలయంలో పనిచేసేవారిని నియమించి వేశారు. అందులో ప్పగంతుల సత్యనారాయణ, పి. శ్రీరాములు ఉన్నారు. అప్పటికి ఆంధ్రపత్రిక, నవాణి తెలుగు దినపత్రికలుగా మద్రాసు నుండి వస్తుండేవి. 'జనవాణి' జస్టిస్ పార్టీ పత్రిక. అప్పట్లో ఫ్లాట్‌బెడ్ రోటరీ మిషన్ గంటకు 4000 ప్రతులను ాత్రమే ముద్రించ గలిగేది. ఆంధ్రప్రభ మధ్యాహ్నం 12 గంటలకు సిద్ధం ేయవలసి వచ్చేది. అందువలన సాయంకాలం దినపత్రిక బయటకు వచ్చేటప్ప ికి ప్రముఖమైన వార్తలు కూడా అందించలేక పోయేవారు. రాజాజీ మంత్రివర్గం సాయంత్రం 4 గంటలకు ప్రకటిస్తేఅటువంటి వార్తను కూడా అందించలేకపోయే వారు. జర్నలిజంలో శిక్షణ లేనివారు, ప్రూఫ్ రీడింగ్ తెలియనివారు ఉండటం వలన 'ఆంధ్రప్రభ' చాలా ఇబ్బందులకు లోనై అనేక దోషాలు దొర్లుతుండేవి. న్యాపతి నారాయణమూర్తిని నెలకు 90 రూ. జీతంతో హఠాత్తుగా తీసుకువచ్చి ఎడిటర్‌గా పెట్టారు. ఖాసా సుబ్బారావు దృష్టిలో అప్పట్లో నార్ల జర్నలిస్టుగా పనికిరాడట! న్యాపతికి కూడా జర్నలిజంలో శిక్షణ లేదు. ఎడిటర్‌గా ఆయన్ను ఎవరూ అదుపులో పెట్టలేకపోయారు. 1941 వరకూ పరిస్థితి ఇలాగే సాగింది. ఆనాటి 'ఆంధ్రప్రభ' సర్క్యులేషన్ 2,700. ఆంధ్రమహాసభ వార్షిక సమావేశం వైజాగ్‌లో జరుగుతున్న సందర్భంగా వైద్యుల రమణరావు సలహాపై 'ఆంధ్ర ప్రభ' ప్రత్యేక సంచిక తీసుకురావటానికి అయిష్టంగా గోయంకా అంగీకరించాడు.

అంతకు ముందు అదే సలహా నారాయణమూర్తి చెప్పినప్పుడు ఆయన ఒప్పుకో లేదు. సమావేశం ఇంకా మూడు రోజులుందనగా నారాయణమూర్తి తన కుమా రుని యజ్ఞోపవీతం ఉత్సవానికి తిరుపతి వెళ్ళాడు. ప్రత్యేక సంచికను గురించి గోయంకా విచారించగా నార్ల తనకేమీ తెలియదన్నారు. మరునాడు నారాయణ మూర్తి వచ్చి తాను నార్లతో చర్చించానని గోయంకాతో చెప్పాడు. ఇద్దరినీ నిల బెట్టి ఆరా తీసేసరికి నారాయణమూర్తిదే దోషం అని తేలిపోయింది. తనను రాజీ నామా పెట్టమని గోయంకా అనేసరికి సాయంత్రం 6 గంటలకు రాజీనామా ఇచ్చి వెళ్ళిపోయాడు. నారాయణమూర్తి కుటుంబం పెద్దది. జీతం చాలేది కాదు. ఆఫీ సుకు వచ్చినవారి దగ్గర 4 అణాల నుండి 10 రూ. వరకూ అడిగి పుచ్చు కుంటుండేవాడు. నార్ల గోయంకా దగ్గరకు వెళ్ళి, నారాయణమూర్తిని మళ్ళీ ఎడిటర్‌గా పెట్టుకోమని అడిగితే ఆయన అంగీకరించారు. మరుసటి రోజు నారాయణమూర్తి వచ్చి చేరారు. ఆ క్రితం రాత్రి నార్ల నారాయణమూర్తి ఇంటికి వెళ్ళి జరిగిన విషయాన్ని ఒక నోట్ వ్రాసి అక్కడ పెట్టి వచ్చారు. 'ఆంధ్ర ప్రభలో' పనిచేసేవారు జీతాలు పెంచాలనీ, పెన్షన్ గానీ, గ్రాట్యుటీ గానీ ఇవ్వా లనీ కోరారు. లేకుంటే సమ్మెకు దిగాలనుకున్నారు. అయితే నారాయణమూర్తి ఈ విషయాన్ని గోయంకాకు చెప్పి, సిబ్బందికి కూడా మీ ఉద్యోగాలు పోతాయని బెదిరించారు. సమ్మెకు సిద్ధపడ్డ సిబ్బంది తరువాత నార్లతో మాట్లాడటం మానేసేసరికి నార్ల రాజీనామా పెట్టారు. ఆ స్థానంలో పండితారాధ్యుల నాగేశ్వరరావును తీసుకు రావాలని నారాయణమూర్తి ప్రయత్నించాడు. నెలరోజుల నోటీసు ఇచ్చిన నార్ల గోయంకా దగ్గరకు వెళ్ళి తనకు వెళ్ళిపోవడానికి అనుమతి ఇవ్వమనీ, లేదా సంపాదకుడిగా చేయమనీ పట్టుబట్టారు. అంతకు ముందు మోటూరు సత్యనారా యణ, మాగంటి బాపినీడు ద్వారా గోయంకా, నార్లకు కబురు చేసి రాజీనామాకు పట్టుబట్టవద్దని కోరారు. తరువాత న్యాపతి నారాయణమూర్తిని వెళ్ళిపొమ్మని, నార్లను సంపాదకుడిని చేశారు. 2,700 ప్రతులు అమ్ముడుబోయే ప్రభ క్రమేణా పెరు గుతూ 1959 లో నార్ల వెళ్ళిపోయేనాటికి 60,000 అయింది. 1942 క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా విధించిన సెన్సార్‌షిప్‌కు అభ్యంతర పెడుతూ 5 నెలల పాటు పత్రిక మూసివేశారు. అప్పుడు నార్ల నెలకు 35 రూ. అద్దె ఇచ్చే ఇంటినుండి 10 రూ. అద్దె ఇంటికి మారారు. ఎడిటర్‌గా 90 రూ. నుండి 100రూ. లకు జీతం పెంచినా వాస్తవానికి సగం జీతమే ఇచ్చేవారు. తరువాత ఖాసా సుబ్బారావు ఎడిటర్‌గా అర్హుడవని శ్రీనార్లను శ్లాఘించారు.

# వివాహం, సంసారం

'ఆంధ్రప్రభలో' చేరకముందే శ్రీ వి. ఆర్. నార్ల వివాహం చేసుకున్నారు. కృష్ణాజిల్లా పెరిసేపల్లికి చెందిన సులోచనగారితో మద్రాసులో వీరి పెళ్ళి జరిగింది. కట్నాలూ, కానుకలూ లేని ఈ పెళ్ళి అటు నార్ల కుటుంబానికి గానీ, సులోచన గారి కుటుంబానికి గానీ అట్టే ఇష్టం లేదు. శ్రీ చెరుకూరి పెద సత్యనారాయణ కుమార్తె సులోచన గారు. ఆయన నాటకాల్లో వేషాలు వేస్తుండేవారు, ఘోషా విపరీతంగా పాటించే పెరిసేపల్లి కమ్మ స్త్రీలు మచిలీపట్నం పోవాలంటే ఎడ్ల బండికి పరదాలు కట్టుకొని వెళ్ళేవారు. సులోచనగారు తెలుగు చదవటం వ్రాయటం వరకూ నేర్చుకున్నారు. 1938 ఏప్రిల్ 24 న మద్రాసు ట్రిప్లికేన్ లోని మానస సరోవర్‌లో కొద్దిమంది సమక్షంలో రిజిష్టరు వివాహం జరిగింది. ఆనాడు అది పెద్ద విశేషమే. సుప్రసిద్ధ తెలుగు సినీ నిర్మాత, 'ప్రజామిత్ర' ఎడిటర్ గూడవల్లి రామబ్రహ్మంగారు పెళ్ళి ఖర్చుల నిమిత్తం 116 రూ॥ ఇచ్చారు. సులోచనగారితో పెళ్ళి అయిన తరువాత నార్ల అంతవరకూ ఉంటున్న గదిని వదిలేసి అద్దెకు ఇల్లు తీసుకున్నారు. సులోచనగారు అప్పటినుండీ నార్లను కంటికి రెప్పవలె చూచుకుంటూ వచ్చారంటే అతిశయోక్తి కాదు. మొదట పుట్టిన ఇద్దరు మగపిల్లలూ ఒకరు నాలుగేళ్ళకూ, మరొకరు రెండేళ్ళకూ వైద్య సౌకర్యం సరిగా లేక చనిపోయారు. అంతటితో నార్ల చాలా విచారపడి వేరే ఇల్లు తీసుకొని ఉండసాగారు. వీరి సంతానంలో ముగ్గురు అబ్బాయిలూ, ఐదుగురు అమ్మాయిలూ అంతా డాక్టర్లుగా పైకి వచ్చారు. పెద్ద కుమార్తె శారద మాత్రం గుంటూరులో వైద్యవృత్తి చేస్తుండగా, మిగిలిన వారంతా అమెరికాలో ఉన్నారు. వారు- మోహన్‌దాస్, దుర్గాదాస్, లక్ష్మణదాస్, చంద్రకళ, మీనాక్షి, ఉమ, రమ. వీరంతా డాక్టర్లనే వివాహం చేసుకున్నారు. ఐతే తనకోసం పిల్లలు త్యాగంచేసి, వారి భవిష్యత్తును పాడు చేసుకోరాదని నార్ల ఉద్దేశ్యం. కనుక విదేశాలకు పోతా మంటే ఆయన అభ్యంతరం పెట్టకపోగా వారిని ప్రోత్సహించి పంపారు.

నార్ల మద్రాసు జీవితం మొదలు విజయవాడ, అటు తరువాత హైదరా బాద్‌లో సులోచనగారు అతి జాగ్రత్తగా నార్ల సేకరించిన గ్రంథాలను కాపాడారు.

ఇంటికి వచ్చిన వారికి అతిథి సత్కారాలు చేయడంలోనూ, సాదరంగా ఆదరించ టంలోనూ సులోచన గారిని జ్ఞాపకం పెట్టుకోని వారు లేరు. నార్ల ఆగ్రహావేశాలకూ, రాగద్వేషాలకూ సులోచనగారు షాక్ అబ్జార్బర్‌గా పనిచేశారు. సులోచన గారు గానీ, నార్ల సంతానం గానీ చాలా సందర్భాలలో ఆయనతో ఏకీభవించక పోయినా, అవగాహనలో లోపం ఉండేది కాదు. తన రచనలు కొన్నిటిని సంతానానికీ, రెండు గ్రంథాలు సులోచన గారికీ నార్ల అంకితం ఇచ్చారు. తన సంతానంలో కొందరు తన అభిప్రాయాలతో ఏకీభవిస్తూ, కులాంతర వివాహాలు చేసుకున్నప్పుడు నార్ల ఎంతో సంతోషించి ఆ విషయం సగర్వంగా చెప్పుకునే వారు. రెండు పర్యాయాలు నార్ల దంపతులు విదేశ పర్యటనచేసి, అనేక ప్రపంచ విశేషాలను చూచి ఆనందించారు. నార్ల గ్రంథాలయంలోని 20 వేల పుస్తకాలను జాగ్రత్తగా అట్టి పెట్టటమే కాక, సులోచనగారు ఒక ట్రస్టు ఏర్పరచి తాను ఒక డైరెక్టర్‌గా ఉంటూ, నార్లపైన, ఆయన ఆలోచనా స్రవంతినిగూర్చి పరిశోధన కొనసాగించే నిమిత్తం కృషి తలపెట్టటం శ్లాఘనీయమైన విషయం. ఈ కృషిలో నార్ల సోదరుడు శ్రీ తాతారావు, నార్ల కుమారుడు డా॥ దుర్గాదాస్, శాయశక్తులా తోడ్పడుతున్నారు. ప్రవాహానికి ఎదురీదే ఈ కృషి అనన్య సామాన్యమే గాని మామూలు విషయం కాదు. రెండు, మూడు విశ్వవిద్యాలయాలవారు నార్ల గ్రంథాలయాన్ని స్వీకరించటానికి ముందుకు వచ్చినా, వారికి ఇవ్వక, ప్రత్యేక పరిశోధనకై దీనిని అట్టిపెట్టారు. అలాగే నార్ల సేకరించిన కళాఖండాలు సహితం బిర్లా మ్యూజియం వారు అడిగినప్పటికీ ఇవ్వకపోవటం మరొక విశేషం.



నార్ల, వారి సతీమణి శ్రీమతి సులోచన

# ఆంధ్రప్రభ సంపాదకులు

'ఆంధ్రప్రభ'ఎడిటరైనప్పటినుండీ శ్రీనార్ల రాత్రింబగళ్ళు కష్టపడి పత్రికను ప్రథమశ్రేణి దినపత్రికగా మార్చటానికి ప్రయత్నించారు. శ్రీరంగం శ్రీనివాస రావు(శ్రీశ్రీ),మల్లవరపు విశ్వేశ్వరరావు, కొమర్రాజు వినాయకరావు ఆంధ్రప్రభలో చేరి నార్లకు తోడ్పడ్డారు. కాని శ్రీశ్రీ కొద్దిరోజులకే ప్రభ వదిలి వెళ్ళిపోయారు. మద్రాసునుంచి వెలువడే ఆంధ్రప్రభ పతాక శీర్షికలకూ, పేజీలు అందంగా తీసుకు రావడానికి ఎంత ప్రాధాన్యత ఇచ్చిందో అలాంటి ప్రాముఖ్యతనే సంపాదకీయాలపై కూడా చూపెట్టింది. నార్ల సంపాదకీయాల కోసమే ఆంధ్రప్రభ చదివిన వారూ, ఉత్తేజితులైనవారూ, వివాదాస్పద విషయాలలో నార్ల ఏమి వ్రాస్తారో అని ఎదురు చూచినవారూ అసంఖ్యాకంగా ఉన్నారు. 1942లో ఐదు మాసాల పాటు ఆంధ్ర ప్రభను కావాలని నిలిపి వేశారు. బ్రిటిష ప్రభుత్వం విధించిన ఆంక్షలకు అభ్యంతరం తెలియజేస్తూ ఇలా నిలిపి వేయటాన్ని జాతీయాభిమానులు మెచ్చు కున్నారు. 1942 నుండి 46 వరకూ ఆంధ్రప్రభ ప్రతులు లభించక పోవటం చాలా విచారకరమైన విషయమే. అమెరికా కాంగ్రెసు లైబ్రరీ లో మాత్రం 1946 నుండి మైక్రోఫిలిం ప్రతులున్నాయి. వేటపాలెం సరస్వతీ నికేతనంలో మాత్రం 1947నుండి 'ఆంధ్రప్రభ' ప్రతులున్నాయి. 'ఆంధ్రప్రభ' సంపాదకీయాలలో 1944 నుండీ కొన్నిటిని ఎంపిక చేసి శ్రీ నార్ల 'మూడు దశాబ్దాలు' పేరిట 1976లో ఒక పుస్తకాన్ని ప్రచురించారు.

1945లో తుఫాను బాధితుల సహాయార్థం ఆంధ్రప్రభ ద్వారా శ్రీ నార్ల లక్ష రూపాయలు విరాళాలు సేకరించి రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఉన్న టంగుటూరి ప్రకాశానికి అందజేశారు. ఐతే ఆ డబ్బును గుంటూరు నరసింహారావు పేరిట బ్యాంకులో వేయగా అది తుఫాను బాధితులకు అందలేదని తెలిసింది. శ్రీ నరసింహా రావు ఆనాడు రాష్ట్ర కాంగ్రెసు కోశాధికారి. ఈ అనుభవందృష్ట్యా శ్రీ నార్ల ఉత్తరో త్తరా రాయలసీమ కరువు సందర్భంగానూ, గోదావరి వరదల సందర్భంగానూ 'ఆంధ్రప్రభ'ద్వారా వసూలు చేసిన విరాళాలను రామకృష్ణమిషన్‌కు అందజేశారు.

మద్రాసులో ప్రకాశం ప్రభుత్వం విచారణలేకుండా నిర్బంధించే ఆర్డినెన్స్ తెచ్చినప్పుడు నార్ల చాలా తీవ్రంగా విమర్శించారు. రాజగోపాలాచారికి వ్యతిరేకంగా ప్రకాశం ముఖ్యమంత్రిత్వాన్ని బలపరచిన నార్ల ఆయన మంత్రివర్గంలోని అవినీతిని బయటపెట్టి ఐదు వ్యాసాలలో తీవ్రంగా గర్హించారు. ఇలా విమర్శలు చేసినప్పుడల్లా నార్లను సంపాదకుడుగా తొలగించమని గోయంకాకు కుప్ప తెప్పలుగా ఉత్తరాలు వచ్చిపడేవి. 1947 ఫిబ్రవరిలో ప్రకాశం మంత్రివర్గాన్ని పడగొట్టిన సందర్భంగా "ప్రజా ప్రభుత్వం" అనే శీర్షికన నార్ల సంపాదకీయాల పరంపర వ్రాశారు ఎన్నికైన ప్రభుత్వాన్ని పడగొట్టిన తీరుపై ఆయన తీవ్ర విమర్శ చేశారు.

1952లో రాయలసీమ దారుణమైన కరువుకు గురికాగా నార్ల స్పందించి అప్పుడే తెలుగు సినీ హీరోగా పైకి వస్తున్న ఎన్.టి. రామారావును పిలిచి సహాయ పడమని కోరారు. ఆ కోరికపై శ్రీరామారావు ఆంధ్రదేశంలో నాటకాలు వేసి విరాళాలను సేకరించి రాయలసీమకు తోడ్పడ్డారు.

1952లో తొలి సాధారణ ఎన్నికలు దేశవ్యాప్తంగా జరిగాయి. స్వాతంత్ర్యోద్యమం పేరిట కాంగ్రెసువారు పట్టాలు పుచ్చుకొని పేదవారు సాగుచేసుకొనే భూములనుండి వారిని వెళ్ళగొట్టారనీ, అలాంటి పట్టాలన్నీ వదులుకోవాలని నార్ల విజ్ఞప్తి చేశారు. ఆ విజ్ఞప్తిననుసరించి కొందరు కాంగ్రెసువారు తమ భూములను వదులుకోగా సుమారు వెయ్యి ఎకరాలు ప్రభుత్వానికి లభించింది. ఈ తొలి ఎన్నికలలో పోటీ చేసిన ఆచార్య రంగా కొత్త పార్టీని (కృషికార్ లోక్‌పార్టీ) కొసక్లపార్టీగా నార్ల చిత్రించారు. శ్రీకాకుళం, చిత్తూరు జిల్లాలలో మాత్రమే కొన్ని సీట్లు నెగ్గగలిగినందుకు అలా పేరు పెట్టారు.

ప్రవాహానికి ఎదురీదడం, హేతుబద్ధంగా ఆలోచించమనటం నార్లకు ఆనవాయితీ అయినా పాఠకులు ఒక పట్టాన ఆమోదించేవారు కారు. నెమ్మదిగా ఆలోచిస్తేగాని ఆయన చెప్పినది సబబని తోచేదికాదు. శ్రీ పొట్టిశ్రీరాములు మద్రాసుతో సహా ఆంధ్రరాష్ట్రం ఏర్పడాలని నిరాహారదీక్ష పూనినప్పుడు నార్ల ఆ వాదనను ఖండించారు. మద్రాసునగరం మనకు దక్కలేదుగాని, పొట్టిశ్రీరాములు చనిపోయారు. అప్పుడున్న ఉద్రిక్త వాతావరణంలో అనేక చోట్ల ఆంధ్రప్రభను తగుల బెట్టడం, నార్లకు వ్యతిరేకంగా నినాదం ఇవ్వటం జరిగింది.

నందికొండ ప్రాజెక్ట్ (నాగార్జున సాగర్) కావాలనే ఉద్యమాన్ని నార్ల సహేతుకంగా బలపరుస్తూ 'ఆంధ్రప్రభ'ను ఒక ఆయుధంగా ప్రయోగించారు.

ఆంధ్రరాష్ట్రానికి రాజధాని గుంటూరు ఉండాలని నార్ల తీవ్రప్రచారం చేశారు. అప్పుడు కూడా ఆయనను తొలగించమని గోయంకావద్దకు చాలామంది రాయబారాలు వెళ్ళారు. కర్నూలును రాజధానిగా ఖాయపరుస్తూ ప్రకాశం మంత్రి వర్గం చేసిన నిర్ణయాన్ని నార్ల విమర్శించినప్పుడు రాయలసీమలో 'ఆంధ్రప్రభ' అగ్నికి ఆహుతి అయింది. రాష్ట్రనాయకత్వానికి జరిగిన పోటీలో సంజీవరెడ్డి, గోపాలరెడ్డి బరిమీద నిలబడగా నార్ల పత్రికాముఖంగా సంజీవరెడ్డిని బలపరిచారు.

1955లో వచ్చిన ఆంధ్ర ఉపఎన్నికలలో నార్ల చాలా ప్రముఖ ప్రచార పాత్రను వహించారు. కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా ఐక్య కాంగ్రెసుకు మద్దత్తుగా నార్ల సంపాదకీయాలు, వేయించిన కార్టూన్లూ ప్రజలను బాగా ఆకట్టుకున్నాయి. ఆంధ్రలో పర్యటించిన 'న్యూస్టేట్స్‌మన్' సంపాదకుడు కింగ్‌స్లీ మార్టిన్ 'ఆంధ్ర ప్రభ' కార్యాలయానికి వచ్చి ప్రపంచంలో మొట్టమొదటిసారిగా కమ్యూనిస్టులు అధికారంలోకి రానున్నారని జోస్యం చెప్పాడు. అందుకు విరుద్ధంగా నార్ల కమ్యూనిస్టులు గెలవరనీ విశ్లేషించి చెప్పారు. చివరకు నార్ల అంచనాయే సరైనదని రుజువయింది.

'ఆంధ్రప్రదేశ్' ఏర్పడుతుండగా ముఖ్యమంత్రి కావాలని టంగుటూరి ప్రకాశం చేసిన ప్రయత్నాన్ని నార్ల తీవ్రంగా వ్యతిరేకించారు. తరువాత ప్రకాశం ఈ విషయంలో నొచ్చుకోకుండా నార్ల ధోరణిని అభినందించారు.

ఆంధ్రప్రభ సిబ్బంది నిమిత్తం నార్ల అనేక పర్యాయాలు యాజమాన్యానికి నచ్చజెప్పటం, వేతనాలూ, ఇతర సౌకర్యాలు ఇచ్చేటట్లు చూడటం జరిగింది. 1958లో ఎడిటర్‌గా నార్ల రాజీనామా ఇవ్వటానికి గోయంకాతో వచ్చిన అభిప్రాయభేదమే కారణం. అప్పుడు శ్రీ నీలంరాజు వెంకటశేషయ్య పేరును ఎడిటర్‌గా ఒక్కరోజు మాత్రం ప్రచురించారు. కాని గోయంకా పక్షాన ఖాసా సుబ్బారావు, కృపానిధి వచ్చి మళ్ళీ 'ఆంధ్రప్రభ' ఎడిటరుగా నార్లను కొనసాగమన్నారు. అందుకు అంగీకరించి నార్ల మరో సంవత్సరం పాటు ఉన్నప్పటికీ 'ఆంధ్రప్రభ' తనది అనేభావం వీరి మనసునుంచి తొలగిపోయింది.

సరికొత్త పదాలు సృష్టించి ప్రయోగంలోకి తీసుకు రావడం కూడా జర్నలిజంలో నార్ల చేసిన కృషికి నిదర్శనంగా పేర్కొనవచ్చు. శిఖరాగ్రం, తిరోగమనం, కాందిశీకులు, ఆరేనవిధానం, ప్రపంచ విజ్ఞాన సమితి, ఐక్యరాజ్యసమితి అనేవి 'ఆంధ్రప్రభ' ద్వారా నార్ల ప్రయోగించి బహుళ ప్రచారంలోకి తెచ్చినవి. శ్రీపాద గోపాల కృష్ణమూర్తి, వేటూరి ప్రభాకరశాస్త్రి వంటివారు నార్ల సంపాదకీయాలనూ, శైలినీ మెచ్చుకొన్న సందర్భాలున్నాయి.

శ్రీ వి. ఆర్. నార్లకు రాగద్వేషాలు బాగా ఉండేవని చెప్పటానికి ఒక సంఘటన ఉదాహరించవచ్చు. మద్రాసులో 'ఆంధ్రప్రభ' ప్రారంభించిన తొలి రోజులలో ఎం. ఎన్. రాయ్, ఎలెన్‌తో సహా మద్రాసు వచ్చారు. గాంధేయవాదానికి మార్గాంతరాలు సూచిస్తూ దేశానికి పునర్వికాసం కావాలని రాయ్ చెబుతూ వచ్చారు. ఆయన మద్రాసు రాక సందర్భంగా ఖాసా సుబ్బారావుగారు 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్'లో ఎలెన్- రాయ్ నుద్దేశించి నిందాపూర్వక వ్యాఖ్యలు కొన్ని చేశారు. గోపీచంద్ ఒక పత్రికా సమావేశాన్ని ఏర్పాటు చేశారు. ఖాసా సుబ్బారావును చూడగానే ఎం. ఎన్. రాయ్ తమ చేతిలో ఉన్న పత్రికను చూపుతూ ఇలాంటి వ్యక్తులకు దండన అవసరం అంటూ బెదిరింపు సూచకంగా రెండడుగులు ముందుకు వేశారట. ఇందుకు అభ్యంతర పెడుతూ పత్రికలవారు సమావేశం నుండి బయటకు నడిచారు. అందులో నార్ల కూడా ఉన్నారు. గోపీచంద్ బతిమిలాడి పత్రికల వారిని మళ్ళీ వెనక్కు పిలుచుకు వచ్చారు. ఆ సంఘటన జరిగిన నాటినుండే వి. ఆర్. నార్ల ఆంధ్రప్రభలో రాయ్ వార్తలను ప్రచురించేవారు కారు. ఈ ధోరణి రాయ్ చనిపోయేవరకూ ఉన్నది. రాయ్‌కు జోహార్లు అర్పిస్తూ దేశవ్యాప్తంగా పత్రికలన్నీ సంపాదకీయాలు వ్రాశాయి. ఆంధ్రప్రభమాత్రం వ్రాయలేదు. గుంటూరు హిందూ కళాశాలలో ఏకాదండయ్య హాలులో జరిగిన ఒక సమావేశంలో ఆవుల గోపాలకృష్ణమూర్తి తీవ్ర విమర్శ చేస్తూ ఊరూ పేరూ లేనివాడు చనిపోతే "ఒక వటవృక్షం కూలింది, ఒక తార రాలింది" అని సంపాదకీయాలు వ్రాసిన వి.ఆర్. నార్ల, ఎం.ఎన్. రాయ్ చనిపోతే ఆమాత్రం వ్రాయలేక పోయారా అని ప్రశ్నించారు. ఈ విషయం తెలిసిన నార్ల రాయ్ పుస్తకాలన్నీ తెప్పించి చదివి పూర్తిగా రాయ్‌వైపుకు మారిపోయారు. రాయ్ భావాలను మెచ్చుకుంటూ ప్రభలో వ్రాయటమే కాక, తాను హ్యూమనిస్టునని చెప్పుకున్నారు కూడా.

ఆంధ్రప్రభలో ఉండగానే నార్ల జర్నలిస్టు యూనియన్‌కు అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. రామనాథ్ గోయంకా ఆయన్ను అభినందిస్తూ యాజమాన్యాలకూ, జర్నలిస్టులకూ మధ్య ప్రభుత్వ జోక్యం గానీ, మూడవ పార్టీ గానీ ఉండరాదనీ, సూటిగా చర్చించుకొని, సత్సంబంధాలు పెంచుకోవాలనీ అన్నారు. అప్పట్లో నార్ల ఈ అభిప్రాయంతో ఏకీభవించకపోయినా ఉత్తరోత్తరా అదే సరైనదిగా భావించారు. ఆంధ్రప్రభలో ఉండగా మద్రాసు ప్రభుత్వం వి. ఆర్. నార్లను ఫిలిం సెన్సార్ సంఘానికీ, పాఠ్యగ్రంథాల ఎంపిక సంఘానికీ, పురావస్తు సలహా సంఘానికి సభ్యులుగా నియమించింది. మొత్తం మీద జర్నలిజంలో అనేక ఒరవడులు ఏర్పరచటానికి 'ఆంధ్రప్రభ'ను శ్రీ వి.ఆర్. నార్ల సాధనముగా వినియోగించారు.

# రాజ్యసభ సభ్యుడు

1958 నుండి 1970 వరకూ రెండు టరంలు రాజ్యసభ సభ్యులుగా శ్రీ వి.ఆర్. నార్ల ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు పార్టీ ఆయనను తమ పక్షాన సభ్యుడిగా ప్రతిపాదించింది. ఈ ప్రతిపాదనకు బెజవాడ గోపాలరెడ్డి, ఎన్. జి. రంగా వ్యతిరేకించారనీ, నీలం సంజీవరెడ్డి అనుకూలత చూపారని రికార్డు చెబుతున్నది. ఇలా తన పేరును వ్యతిరేకించిన దృష్ట్యా ఎన్.జి. రంగాను కొన్నాళ్ళ పాటు శ్రీ నార్ల కావాలని సాధించిన ఘట్టం కూడా ఉన్నది. రంగాకు తల్లి దండ్రులు పెట్టిన పేరు రంగనాయకులు కనుక ఆంధ్రప్రభలో గోగినేని రంగ నాయకులు అని కొన్నాళ్ళపాటు వాడారు. రంగా, ఆయన అనుచరులు కూడా ఆ పేరు వాడినంత కాలం కుళ్ళి, కుళ్ళి వాపోయారు. ఆ పేరు తొలగించ వలసిందిగా రామనాథ గోయంకాకు విజ్ఞప్తి చేసుకున్నారు. ఇలా కొంతకాలం ప్రయోగించిన తరువాత మళ్ళీ ఎన్.జి. రంగా అని వాడగా ప్రశాంతత ఏర్పడింది. 1956 లోనే శ్రీ నార్లను కాంగ్రెసు పార్టీ పక్షాన శాసనసభకు పోటీ చేయవలసిందిగా ఒక ప్రతిపాదన వచ్చింది. దాని కాయన అంగీకరించలేదు. రాజ్యసభ సభ్యుడిగా ఎన్నికైన తరువాత శ్రీ నార్ల ఎడిటర్‌గా ఉంటూనే ఢిల్లీ వెళ్ళి వస్తూండేవారు. తనకు ఇష్టమైన విషయంపై ఆయన సభలో చర్చలలో పాల్గొన్నారు. అవి పరిమితంగానే ఉన్నవి. అందులో కొన్ని ఉదాహరణలుగా పేర్కొనవచ్చు

1960 డిసెంబరు 16 న రాజ్యసభలో హిందీలోనూ, భారతీయ భాషల్లోనూ అనువాదాల నిమిత్తం నిపుణుల సంఘం వేయాలనే ప్రతిపాదనపై నార్ల చర్చలో పాల్గొన్నారు. అనువాదం అంటే యాంత్రికంగా జరిగే రీతి కాదనీ, మూలం అవగాహన చేసుకుని, మళ్ళీ సృష్టించటం జరగాలనీ నార్ల చెప్పారు. కనుక అనువాద కార్యాన్ని సృజనాత్మక రచయితలకు అప్పగించాలనీ సూచించారు. జపాన్ వలె అభివృద్ధి చెందటానికి వీలుగా ఇండియా కూడా వైజ్ఞానిక పదజాలాన్ని అంతర్జాతీయ ప్రయోగాలు జరుగుతున్న తీరులో యధా తథంగా స్వీకరించాలని చెప్పారు. స్పుత్నిక్ అనే పదం ప్రపంచ వ్యాప్తంగా

అంతా స్వీకరించిన తీరును గుర్తు చేస్తూ, ఈజిప్టు కూడా అరబిక్ భాషలతో పాటు అంతర్జాతీయ పద ప్రయోగాన్ని అనుసరిస్తున్నదన్నారు. ప్రజలు కొన్ని సందర్భాలలో అవసరాన్ని బట్టి పదాలను సృష్టిస్తారనీ, విశాఖపట్నం ఓడరేవు త్రవ్వే పరికరాన్ని త్రవ్వోడ అని పనిచేసే కూలీలు వాడి, ఆ పదాన్ని అందరికీ అర్థమయ్యేటట్లు చేశారనీ చెప్పారు. తెలుగులో రెవెన్యూ పదాలు 90 శాతం ఉర్దూ భాష నుండి వాడుకలోకి తెచ్చుకున్న సందర్భాలను కూడా ఆయన సోదాహరణగా వివరించారు.

బెరూబారి యూనియన్ ప్రాంతాన్ని పాకిస్తాన్‌కు బదిలీ చేసే విషయం చర్చకు రాగా 1960 డిసెంబరు 23 న శ్రీ వి. ఆర్. నార్ల పార్లమెంటులో కమ్యూనిస్టులను, ముఖ్యంగా జ్యోతిబసును తీవ్రమైన పదజాలంతో ఖండించారు. నెహ్రూపై కమ్యూనిస్టుల దాడిని ఆయన త్రిప్పికొడుతూ, నెహ్రూ వ్యక్తిత్వాన్ని, గొప్పతనాన్ని సభలో చాటి చెప్పారు. ఉత్తర సరిహద్దులలో చైనాతో ఇండియాకు గల ప్రమాదాన్ని ప్రస్తావించారు. కమ్యూనిస్టులు ప్రజలను హిస్టీరియాలో పెట్టే ధోరణి అవలంబించటాన్ని నార్ల ఖండించారు. ఒకే పార్టీ, ఒకే నాయకుడు ఉండటం ప్రజాస్వామ్య పద్ధతి కాదంటూ, అదే సమయంలో నెహ్రూవంటి నాయకుడు నిర్వహించిన పాత్రను గుర్తించాలన్నారు.

సాలార్‌జంగ్ మ్యూజియాన్ని గురించి మాట్లాడుతూ శ్రీ వి. ఆర్. నార్ల (1960 డిసెంబరు 15) ప్రపంచవ్యాప్తంగా 100 మ్యూజియంలు క్షుణ్ణంగా పరిశీలించిన తరువాత సాలార్‌జంగ్ మ్యూజియంలో 60 శాతం వరకూ ఉన్న వస్తువులు చెత్తచెదారంగా ఆయన చిత్రీకరించారు. వాటిని తొలగిస్తే మ్యూజియంకు విలువ ఉంటుందన్నారు. ఈ చెత్త వలన విలువైన వస్తువులకు గుర్తింపు లేకుండా పోయిందన్నారు.

నాగార్జునకొండపై బౌద్ధ కళాఖండాలను నిక్షిప్తం చేయాలనే ప్రతిపాదనను శ్రీ నార్ల సమర్థిస్తూ, వాటిని సాలార్‌జంగ్ మ్యూజియంకు తరలించాలనే ప్రతిపాదనను వ్యతిరేకించారు. హైద్రాబాదులోని స్టేట్ మ్యూజియంలోని వస్తువులు కొన్ని సాలార్‌జంగ్ మ్యూజియంకు పంపించాలనీ, మరికొన్ని వస్తువులు కొనాలనీ, అప్పుడే సాలార్‌జంగ్ మ్యూజియంకు విలువ లభిస్తుందనీ చెప్పారు. సాలార్‌జంగ్‌కు

జోహార్లు అర్పించటంలో తాను వెనుకాడ-బోవటం లేదని శ్రీ నార్ల చెబుతు మ్యూజియం ఉన్న స్థితి పట్ల తాను నిరుత్సాహపడినట్లు పేర్కొన్నారు.

'భారతదేశంలో స్వాతంత్ర్యోద్యమ చరిత్ర'ను గురించి శ్రీ వి. ఆర్. నా 1961 మే 5న రాజ్యసభలో ప్రసంగించారు. చరిత్రలో ఉన్నత, అధమ ద లుంటాయనీ, ఇండియాలో 18వ శతాబ్దం అథమ దశకు చెందినదనీ, అందుక సిగ్గుపడాల్సిందేమీ లేదనీ చెప్పారు. కొద్దిమంది వర్తకులు సైనికశిక్షణ కూడ లేకుండా ఇండియాను జయించగలిగారన్నారు. అలాంటి విషయాలన్నీ ఈ చరిత్ర ప్రస్తావించినదనీ, అందువలన ఆ గ్రంథం విమర్శకు గురి కారాదనీ అన్నారు అక్కడక్కడా కొన్ని లోపాలున్నప్పటికీ, డా॥ తారాచంద్ వ్రాసిన ఈ గ్రంథాన్ని అభినందించక తప్పదనీ నార్ల పేర్కొన్నారు. కొసాంబీ వ్రాసిన భారత చరిత్రక ఉపోద్ఘాతాన్ని కూడా నిష్పాక్షికమైనదిగా ఆయన ప్రస్తావించారు. వాస్తవాలన గ్రహించాలనీ, భవిష్యత్తుపై దృష్టి పెట్టాలనీ శ్రీ నార్ల నొక్కి చెప్పారు. ప్రొఫె సర్ హుమాయున్ కబీర్ గ్రంథపీఠికలో వ్రాస్తూ తారాచంద్ వ్రాసిన విషయా లకు ప్రభుత్వం బాధ్యత వహించటం లేదని చెప్పటాన్ని కూడా ఆయన విమర్శిం చారు. చరిత్రను పరిశీలించటంలో మార్క్సిస్టు దృక్పథాన్ని అన్వయించటం తప్పు కాదని, హెరాల్డ్ జె. లాస్కి కూడా ఈ పద్ధతిని అవలంబించాడని నార్ల తారాచంద్‌ను సమర్థించారు.

పనిచేస్తున్న జర్నలిస్టుల విషయమై శ్రీ వి.ఆర్. నార్ల 1962 డిసెంబరు 11న రాజ్యసభలో మాట్లాడారు. పత్రికలను జాతీయం చేయరాదనీ, నియంతృత్వ రాజ్యాలలో తప్ప ఈ పద్ధతి ప్రజాస్వామ్యానికి పనికిరాదనీ ఆయన నొక్కి చెప్పారు. పత్రికారంగంలో రోజురోజుకూ బలపడుతున్న గుత్తాధిపత్యాన్ని కూడా నార్ల ప్రస్తావించి, ఉద్యోగావకాశాలు ఎక్కువగా లభిస్తేనే వర్కింగ్ జర్నలిస్టు లకు రక్షణ లభిస్తుందన్నారు. పెద్ద పత్రికలలో సమ్మె జరిగినప్పటికీ జర్న లిస్టులు ఆట్టేకాలం సమ్మెను కొనసాగించలేకపోతున్నారని, వారికి మార్గాంతరాలు లేకపోవటమే ఇందుకు కారణమనీ చెప్పారు. చిన్న పత్రికలకు రక్షణ కల్పించే సూచనలు, ప్రకటనల రేట్లు నిర్ణయించటం మొదలైనవి ఆయన తెలియపర్చారు. ప్రభుత్వం రోటరీ మిషన్ల వంటివి చిన్న పత్రికలకు వాయిదా పద్ధతిపై సరఫరా చేయాలన్నారు.

భారత రక్షణ బిల్లుపై జరిగిన చర్చలో శ్రీ వి. ఆర్. నార్ల సుదీర్ఘ ప్రసంగం చేస్తూ, 1962 డిసెంబరు 6 న రాజ్యసభలో ప్రసంగించారు. చైనా ఒక వైపున అలీన విధానాన్ని చెబుతూనే పంచశీల సూత్రాన్ని ఉల్లంఘించిన విషయమై శ్రీ నార్ల చైనాను ఖండించారు. కమ్యూనిస్టు పార్టీలు 47 ఉన్నాయనీ, ప్రపంచంలో 13 కమ్యూనిస్టు ప్రభుత్వాలున్నాయనీ, అవేవీ చేయని దురాక్రమణను చైనా ఇండియాపై జరిపిందనీ ఆయన తెలిపారు. సన్ ఎట్ సెన్, చాంగ్ కై షేక్ రాజ్యాధినేతలుగా ఉన్నప్పుడు కూడా చైనా సరిహద్దులు దక్షిణ ఆసియాలో ఉన్నట్లు పేర్కొన్నారని జ్ఞాపకం చేశారు. ఇంగ్లండు కామన్‌వెల్త్ దేశాలు, అమెరికా మనకు చేసిన సహాయాన్ని కృతజ్ఞతతో స్వీకరించినా, వాటి సంరక్షణను మనం అంగీకరించరాదని హెచ్చరించారు. రక్షణకు సంబంధించిన అనేక విషయాలు తొందరపడి ఇండియా బయట పెడుతున్నదనీ, ఈ విషయంలో జాగ్రత్త అవసరమనీ ఆయన సూచించారు. చైనా తన గూఢచారి చర్యలతో, ఏజెంట్లతో సమాచారాన్ని సేకరిస్తుండగా, ఆలాంటివారికి మనం ఇవ్వగూడని సమాచారాన్ని ఇస్తున్నామని అన్నారు. ప్రభుత్వం చేపట్టే తీవ్ర అధికారాలను విచక్షణతో వినియోగించాలని నార్ల కోరారు.

దక్షిణభారత హిందీ ప్రచార సభను గురించి 1963 ఆగష్టు 29 న శ్రీ వి. ఆర్. నార్ల రాజ్యసభలో ప్రసంగించారు. గాంధీజీ తన కుమారుడు దేవదాసును హిందీ ప్రచారకుడిగా మద్రాసు పంపిన విషయాన్ని శ్రీ నార్ల ప్రస్తావించి, క్రమేణా హిందీని నిర్బంధం చేయుట ద్వారా దక్షిణాదిలో ఈ సభ ప్రాధాన్యత, ఆర్థిక వనరులు తగ్గిపోతాయని హెచ్చరించారు. ఉస్మానియా యూనివర్సిటీని దక్షిణాది హిందీ యూనివర్సిటీగా మార్చడాన్ని కూడా ఆయన వ్యతిరేకిస్తూ, హిందీ ప్రచారసభ ఈ కార్యక్రమాన్ని చేపట్టవచ్చునన్నారు. హిందీని అభివృద్ధి చేయటంలో దక్షిణాదిలోని వారి సహకారాన్ని స్వీకరించాలని కూడా ఆయన పేర్కొన్నారు. హిందీపట్ల హిందీ మాట్లాడని వారిలో గల మానసిక వ్యతిరేకతను తొలగించడానికి గాను, హిందీ అనే పదం బదులు భారతి అని పద ప్రయోగం చేయాలన్నారు. హిందూస్థానీ అనే పదాన్ని వాడాలని గాంధీజీ సూచించినప్పుడు హిందీవాదులు వ్యతిరేకతను వ్యక్తపర్చటం నార్ల గుర్తు చేశారు.

అధికార భాషను గురించి 1967 డిసెంబరు 21న శ్రీ నార్ల సుదీర్ఘ ప్రసంగం చేశారు. ఇంగ్లీషు భాష మనలో స్వేచ్ఛా పిపాసను రేకెత్తించడానికి తోడ్పడినట్లు చెబుతూ శ్రీ నార్ల ఇంగ్లీషు భాషను ఖండించేవారు భారతీయ పునర్వికాస చరిత్రను పరిశీలించాలని కోరారు. హిందీ మాట్లాడేవారిలో కొద్ది మంది అసహనంతో, ఛాందసంతో ఉంటూ ద్వేషానికి గురవుతున్నారని చెప్పారు. ఇంగ్లీషు విదేశీభాష అనేమాట నిజమే గాని, దక్షిణాదిలో హిందీ కూడా విదేశీ భాషే ననే విషయం మర్చిపోరాదనీ, హిందీవారికది మాతృభాషయితే, దక్షిణాది వారది కష్టపడి నేర్చుకోవాలనీ చెప్పారు. అయినప్పటికీవారు హిందీ నేర్చుకోవడానికి సిద్ధంగా ఉన్నారనీ, కొంత వ్యవధి వారికివ్వాలనీ, హిందీనివారు తక్షణమే నేర్చుకోవాలన్న ప్పుడే ఇబ్బంది వస్తున్నదనీ చెప్పారు. హిందీ భాష భారతీయ భాషలలో అంతగా పరిణతి చెందని పిన్న వయస్కురాలనీ గుర్తించాలి. హిందీతో పోల్చితే తమిళం, తెలుగు, కన్నడం, మలయాళం ప్రాచీన భాషలని అన్నారు.

హిందీ నేడున్న రీతిలో 100 సంవత్సరాల ప్రాయం గల భాష మాత్రమే. హిందీ ప్రాంతంలో వ్రజ భాష, బుందేలీ, మార్వాడీ, మేవాడీ, జైపురి, మాల్వీ, అవధీ, భగేలి, చత్తిస్‌గర్హి. మైథిలీ, భోజ్‌పురి, మగధి, ఖడీబోలి మొదలైనవన్నీ ప్రాంతీయ భాషలు. ఇందులో ఖడీబోలి అనేభాష 100 సంవత్సరాలుగా ప్రాధాన తను సంతరించుకున్నది. కనుక ఇది ఎంతో పెంపొందవలసి ఉన్నది. దీనికి అంత ర్జాతీయ స్థాయి రావడానికి చాలా కృషి జరుగవలసి ఉన్నదని నార్ల చెప్పారు, హిందీ నేర్చుకోవడమే దేశభక్తి, జాతీయవాదం అనీ, నేర్చుకోకపోతే జాతివ్యతి రేకత అనీ హిందీ ఛాందసులు వాదించటాన్ని నార్ల ఖండించారు. రాజాజీ అన్నాదొరై హిందీని వ్యతిరేకించినా, వారు దేశభక్తులు, జాతీయవాదులు కాకుండా పోలేదన్నారు. హిందీ నేర్చుకోవడానికి వ్యవధి, అవకాశం ఉండాలనీ, హిందీ భాషాభివృద్ధిలో దక్షిణాదివారికి అవకాశం ఉండాలనీ చెప్పారు. హిందీ నుండి అనేక పదాలు ఇంగ్లీషు స్వీకరిస్తుండగా, హిందీ ఛాందసులు ఒక్క ఇంగ్లీషు పదం కూడా రాగూడదనే ధోరణిని అవలంబిస్తున్నారని ఆయన చెప్పారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పత్రికా స్వేచ్ఛను అణచడానికి తెచ్చిన బిల్లును గురించి 1968 అగస్టు 22న శ్రీ వి. ఆర్. నార్ల రాజ్యసభలో సావధాన తీర్మా నాన్ని ప్రవేశపెట్టారు. అప్పుడు కాసు బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్నారు.

పత్రికా స్వేచ్ఛను అణచడానికి రాష్ట్ర ప్రభుత్వం ఈ బిల్లు తెచ్చినట్లు ఆయన పేర్కొన్నారు. బ్రిటీష్ పాలకులనాటి పత్రికానియమాలు, నైజాము కాలంలో పత్రికలపై ఆంక్షలు కూడా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెచ్చిన బిల్లుకు సరితూగ వని ఆయన చెప్పారు. పత్రికాస్వేచ్ఛను కూకటివ్రేళ్ళతో తొలగించే ఈ బిల్లు విషయమై 'హిందూ' పత్రిక చేసిన వ్యాఖ్యను కూడా నార్ల సభకు వినిపించారు. పత్రికలపై ప్రభుత్వం విధించే ఆంక్షలు ఒకసారి ప్రారంభమైతే, ఎక్కడ అంత మవుతాయో తెలియదన్నారు. ప్రకటించబోయే విషయాలను ప్రభుత్వం పరిశీలిస్తా మనటం కేవలం ముందుగా సెన్సార్ చేయటమేనని ఆయన అన్నారు.

# నార్లవారి గ్రంథాలయం

హైదరాబాదులో నార్ల ఇంటికి వెళ్ళినవారికి- ఆయన ఇంటిలో లైబ్రరీ ఉన్నదా - లేక, ఆయన లైబ్రరీలో ఉంటున్నాడా అని సందేహం రావడం సహజం. చాలా ఇళ్ళలో, డ్రాయింగ్ రూమ్‌లలో ప్రతిష్ఠ కోసం షోకేసులలోకొన్ని పుస్తకాలు అందంగా అమర్చి పెట్టుకోవడం అనవాయితీగా కనిపిస్తుంది. నార్ల ఇంటిలో పుస్తకాలు తప్ప మిగిలిన వస్తువులకు చోటు దొరకటం కష్టం. 40 సంవత్సరాల జర్నలిస్టు జీవితంలో పుస్తకాల సేకరణ ఒక ప్రధాన అంశంగా నార్ల భావించారు. ఆయన జీవితాన్ని పరిశీలిస్తే, ఇంటర్మీడియట్ పూర్తి అయినప్పటి నుండీ పుస్తక సేకరణకు నాంది పలికినట్లు తెలుస్తున్నది. 1929లో మద్రాసులో జరిగిన కాంగ్రెసు మహాసభలకు ప్రేక్షకుడిగా వెళ్ళిన నార్ల, మూర్ మార్కెట్‌లో పుస్తకాలు చూచి ఆకర్షితులయ్యారు. అదే అలవాటు జీవితమంతా కొనసాగింది. సెకండ్ హాండ్ పుస్తక మార్కెట్లలో సాహిత్యం, కళలు, సామాజిక శాస్త్రాలు ఆయనను ప్రధానంగా ఆకర్షించినవి. సైన్సు, గణితం, సాంకేతిక శాస్త్రాలు, ఆర్థిక శాస్త్రాల జోలికి అట్టే పోయేవారు కాదు. నార్ల పుస్తక సేకరణలో కొత్తవి కొనడం, రివ్యూ పుస్తకాలలో ఉత్తమమైనవని భావించినవాటిని సేకరించటం, సెకండ్‌హాండ్ పుస్తకాలు కొనుగోలు చేయటం అనేవి ప్రధానంగా కనిపిస్తుంది. ఎప్పుడైనా మిత్రుల వద్ద వారుపయోగించకుండా పడి ఉన్న విలువైన పుస్తకాలను అడిగి తీసుకున్న సందర్భాలు కూడా లేకపోలేదు.

మద్రాసులో మూర్ మార్కెట్‌తో పాటు మహదేవన్ పుస్తకాల షాపుకు (అది ఇల్లుకూడా) వెళ్ళడం ఇంచుమించు మేధావులకు నిత్యకృత్యంగా ఉండేది. మద్రాసు రాకముందు పుస్తకాలపై అభిరుచిఉన్నా, ఆర్థిక కారణాల వలన సేకరణ అట్టేజరుగలేదు. కాకినాడలో కాలేజీ లైబ్రరీపై ఆధారపడటం, బందర్‌లో సెకండ్ హాండ్ విదేశీ (బ్రిటన్) పత్రికలు కొనడం, వాటిని జర్నలిజానికి వాడుకోవడం మనకు తెలుసు. మద్రాసుకు నార్ల 1936లో వచ్చినా, ఆంధ్రప్రభలో కుదురుకునే వరకూ గ్రంథాల సేకరణ తక్కువగానే జరిగింది. ఆంధ్రప్రభలో ఎడిటర్

అయిన తరువాత అనేక విషయాలపై సంపాదకీయాలు వ్రాయటం తప్పనిసరి అయినందున నార్ల ఇంకా ఎక్కువగా చదువటం, పుస్తకాలు సేకరించటం విధిగా జరుపవలసి వచ్చింది. ఆయన సంపాదకుడు అయినప్పుడు రెండవ ప్రపంచ యుద్ధం ముమ్మరంగా సాగుతున్నది. యుద్ధ విషయాల నిమిత్తం పుస్తక సేకరణ విపరీతంగా చేసినట్లు నార్ల చెప్పారు. ఆ విధంగా మద్రాసులో సేకరించిన పుస్తకాలతో సహా ఆంధ్రప్రదేశ్ అవతరణ అనంతరం విజయవాడకు తరలి వచ్చారు. మద్రాసులోనూ, విజయవాడలోనూ అద్దె ఇళ్ళలో పుస్తకాలు తీర్చి దిద్దటానికి వీల్లేని పరిస్థితులు ఉండేవి. వాటిని కాపాడటం, దుమ్ము దులపడం, జాగ్రత్తగా చెదలు పట్టకుండా మందులు కొడుతూ పోషించే బాధ్యతను సులోచనగారు స్వీకరించారు. అదేమంత తక్కువ శ్రమ కాదు.

1968 నుండి హైద్రాబాద్ బంజారాహిల్స్‌లో ప్రభుత్వం కేటాయించిన చిన్న ఇల్లును కొద్దిగా విస్తరించి మార్పులు, చేర్పులు చేసుకొని నార్ల తన పుస్తకాలకు ఒక స్థావరాన్ని సంపాదించుకున్నారు. అయినా చోటు చాలలేదు. అంతకుమించి చేసేదిలేక సర్దుకుపోయారు. హైదరాబాదులో ఆదివారాలు పేవ్‌మెంట్ల మీద దొరికే సెకండ్‌హాండ్ పుస్తకాలను సేకరించటం కూడా అలవాటుగా నార్లకు మారింది. విదేశాలకు వెళ్ళినప్పుడు ఇదేవిధంగా రిమైండర్ పుస్తకాలను ఎంపిక చేసుకోవడం, చెదురుమదురుగా కొత్త పుస్తకాలు కొనడం, ఆ పార్సిళ్ళలో చేరినవి చేరగా, పోయినవి పోగా, చేసేది లేక లభించినవాటిని భద్రపరిచేవారు. ఈ విధంగా నార్ల సేకరించిన పుస్తకాలు 20 వేలకు మించగా వాటన్నిటినీ వర్గీకరించి, కేటలాగు ఏర్పరిచారు. తెలుగు పుస్తకాలకు మాత్రం ఆ మాత్రం చోటు కూడా లేక గరాజే గతి అయింది. ఉన్నంతలో గదుల వారీగా అలమార్లలో అమర్చిన పుస్తకాలను, కళాఖండాలను దృష్టిలో పెట్టుకొని నార్ల గదికొక పేరు కూడా పెట్టుకున్నారు.

నార్ల ఇంట్లోకి ప్రవేశించగానే మొదటి గదిలోనూ, కారిడార్‌లోనూ ఆర్ట్, క్లాసికల్, ఆధునిక డ్రామాలు, గ్రాహం గ్రీన్, పుష్కిన్, గోరే వైడల్, ఇర్వింగ్ స్టోన్ వంటి వారి రచనలు కనిపిస్తాయి. మొదటిగదిలో రెండవ ప్రపంచ యుద్ధానికి సంబంధించిన గ్రంథాలు పుష్కలంగానూ, అమెరికా, రష్యా, ఐర్లండ్, ఇంగ్లండ్ దేశాల ప్రాచీన, ఆధునిక డ్రామాలు, డిడొరొ, నెపోలియన్, డిగోల్,

గారిబాల్డి మొదలైన వారిపై రచనలు ఎదురవుతాయి. రెండవగదిలో భారత దేశానికి సంబంధించిన వివిధ కోణాల విషయ పరిశీలనలు, మొగల్, బ్రిటిష్ ఇండియా రచనలు, ఫెడరలిజం, రాష్ట్రాలవారీగా చరిత్రలు, స్మృతి చిహ్నంగా వెలుపడిన గ్రంథాలు, సాంసర్‌లు కొల్లలుగా ఎదురవుతాయి.

మెట్ల క్రింద అమెరికా ప్రజాస్వామ్యాన్ని ఉంచారు. నార్లకు అమెరికాలోని జఫర్‌సన్, వాషింగ్టన్, లింకన్, రూజ్‌వెల్ట్‌లపై ప్రత్యేక ఆసక్తి ఉండేది. వారికి సంబంధించిన పుస్తకాలు అక్కడ చోటు చేసుకున్నాయి. ఎందుకోగానీ నార్ల ఈ క్రింది గదులకు పేర్లు పెట్టలేదు. కానీ, మెట్లెక్కి మొదటి గదిలోకి ప్రవేశించగానే మేవాడ్ గది అని పిలిచేవారు. అందులో ఆరు అరుదైన మేవాడ్ చిత్రాలు గోడలపై అలంకరించుకొని ఉన్నవి. అందుకే ఆ పేరు పెట్టారు. ఇక్కడ ఇలియట్, ఈట్స్, జోడ్, ఆల్డస్ హక్స్లీ, ఎమర్సన్, లాంబ్, బెర్గ్‌సన్, లెస్లీ స్టీఫెన్ వంటి వారి రచలను అమర్చారు. మేవాడ్ గదిలోకి ప్రవేశిస్తుంటే ఆర్థిక శాస్త్రానికి సంబంధించిన గ్రంథాలు కొన్ని కనిపిస్తాయి. అక్కడే హెమింగ్‌వే రచనలు కూడా చూస్తాము.

తరువాతి గది పేరు "కృష్ణ" అట. ఇందులో కృష్ణుడికి సంబంధించిన నాలుగు చిత్రపటాలు ఉన్నాయి. కళాత్మకదృష్టితో తప్ప, నార్ల వీటిని భక్తి ప్రపత్తులతో చూడలేదు. ఈ గదిలో నార్ల రచనలన్నీ ఒక ప్రతి చొప్పున బైండు చేసి ఉంచారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి స్వదస్తూరితో కూడిన ప్రశంసా పత్రం ఫ్రేమ్ చేసి ఉంచారు. వివిధ దేశాల జర్నలిజం గ్రంథాలు, సుప్రసిద్ధ కార్టూనిస్టులరచనలు, దేశాల చరిత్రలు, మపాసా, జాన్సన్, బెర్నార్డ్‌షా, ఉల్ఫ్ దంపతుల రచనలు ఉన్నాయి.

తరువాత శివుడి గదిలోకి ప్రవేశిస్తాము. ఇందులో శివుని చిత్రపటం, నటరాజ విగ్రహాలు, తత్సంబంధమైన కళాఖండాలు అమర్చారు. మాక్స్ ముల్లర్ రచనలు, గీతపై విశేష సేకరణ, హిందూ బౌద్ధ, సిక్కు, ముస్లిం దర్శనాలు, తత్వాలు, శాక్త, బసవేశ్వర, తిరుకురల్, కేశవ చంద్రసేన్ రచనలు ఉన్నాన్నా. అక్కడ నుండి ప్రక్కన ఉన్న బుద్ధుడి గదిలోకి ప్రవేశిస్తుంటే వీరేశలింగం స్వదస్తూరితో వ్రాసిన పత్రం ఒకటి ఫ్రేములో కనిపిస్తుంది.

నార్ల దక్షిణ ఆసియా దేశాలలో పర్యటించి, సేకరించిన వివిధ బౌద్ధ ప్రతిమలు ఒకచోట అందంగా అమర్చి, దానికి బుద్ధుని గది అని నామకరణం చేశారు ఇక్కడ పైనా ప్రాచీన గ్రంథాలు, కమ్యూనిస్టు గ్రంథాలు, భారతీయ సంస్కృతిపై రచనలు, ఆసియా చరిత్ర, దేశంలోని వివిధ సాహిత్య సంస్కృతులకు సంబంధించిన రచనలు, భారతం, పురాణాలకు చెందిన విషయాలు చోటు చేసుకున్నాయి.

చిట్టచివరిగా సంపాదకుని గది చూస్తాము. నార్ల సుప్రసిద్ధుడయింది సంపాదకుడిగానే. ఆంధ్రప్రభలోనూ, ఆంధ్రజ్యోతిలోనూ సిబ్బంది ఆయనను ఎడిటర్‌గారు అనే పిలిచేవారు. సంపాదకునిగా నార్ల తన సంపాదకీయాలు వ్రాయటానికి కుర్చీ ప్రక్కన చెత్తబుట్టను, బల్లమీద సిగరెట్ పాకెట్లనూ, డబ్బాలనూ అమర్చి, కృత్యాద్యవస్థ పడినట్లు చెప్పుకున్నారు. అంటే సంపాదకీయం ఎత్తుగడ బాగుండాలనే ప్రయత్నంలో మథనపడే వారన్నమాట. అందుకని ఎత్తుగడ తనకు సంతృప్తి నిచ్చేవరకూ వ్రాస్తూ, కాగితాలు చింపేస్తూ పోయేవారు. ఈలోగా సిగరెట్లు చాలా తగలడుతుండేవి. ఇది ఒకనాడు కాదు, ఒక సంవత్సరం కాదు, 30 ఏళ్ళుగా నార్ల జరిపిన కృషిలో భాగం. చివరకు రెండు, మూడు పర్యాయాలు గుండెపోటు రాగా డాక్టరు వార్నింగ్ పాటించవల్సి వచ్చినప్పుడు మాత్రమే సిగరెట్లు మానేసేవారు. నార్ల సంపాదకీయ గదిలో నిఘంటువులు, విజ్ఞానసర్వస్వాలు, సామెతలు, జానపద గ్రంథాలు పుష్కలంగా అమర్చబడి ఉంటాయి. దేశనాయకుల రచనలు-గాంధీ, ఎం.ఎన్. రాయ్, నెహ్రూ టాగోర్. అరవిందుడు, తిలక్, వినోబా, లజపతిరాయ్, అంబేద్కర్, లోహియా రచనలు ఇక్కడ చూస్తాము. థింకర్స్ లైబ్రరీ ప్రచురణలన్నీ ఇక్కడ ఉన్నాయి గోల్డెన్ బౌ సెట్ ఉన్నది. ఈ గదిలోనే ప్రపంచ నాయకుల, శాస్త్రవేత్తల ప్రతిమలు ఉత్తేజాన్ని కలిగిస్తూ కనిపిస్తాయి. వీటిలో సోఫోక్లిస్, సోక్రటీస్ మొదలు మార్క్స్ వరకూ, నెపోలియన్ నుండి లింకన్ వరకూ, బుద్ధుడి నుండి ఐన్‌స్టీన్ వరకు నమూనా ప్రతీకలు ఉన్నవి. రవీంద్రనాథ్ టాగోర్ స్వదస్తూరి పత్రం ఒకటి ఫ్రేములో కనిపిస్తుంది. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి ప్రశంసిస్తూ నార్లకు వ్రాసిన ఉత్తరాన్ని కూడా ఆయన గౌరవంగా ఫ్రేము కట్టించి పెట్టారు.

తన గ్రంథాలు హేతువాద, మానవవాద, లౌకిక విషయాలలో పరిశోధ నకు తోడ్పడాలని నార్ల ఆశించారు. ఈ రంగాలలో ప్రచురితమయ్యే ఆధునిక రచనల సేకరణతో తన గ్రంథాలయాన్ని ఆధునాతనం గావిస్తూ ఉండాలని ఆయన ఉద్దేశం. ఒక వ్యక్తి ఇన్నేళ్ళుగా ఇన్ని గ్రంథాలు సేకరించటం వాటిని అట్టి పెట్టటం, క్రమబద్ధం చేయడం అనేవి నార్లకు గల ప్రత్యేక అభిరుచికీ, ఆసక్తికీ నిదర్శనం. ఈ కృషిలో తోడ్పడి నార్ల ఆశయాలను సాధించటానికి ప్రయత్నం కొనసాగిస్తున్న శ్రీమతి సులోచన గారు పరిశోధకుల దృష్టిలో అభినందనీయులు.

# ఆంధ్రజ్యోతి సంపాదకులు

'ఆంధ్రప్రభ' నుండి విరమించిన శ్రీ వి.ఆర్. నార్ల వారపత్రిక పెట్టాలని ప్రయత్నాలు చేశారు. కృష్ణాపత్రికను స్వీకరించి, విజయవాడనుండి వారపత్రికగా నడపాలనుకున్నారు. పైడిమర్రి సత్యనారాయణ యాజమాన్య వ్యవహారాలు చూచుకోవాలనీ, తాను సంపాదకుడిగా ఉండాలని నిర్ణయించారు. ఇందుమించు ఏర్పాట్లన్నీ పూర్తిచేసుకున్నారు. సరైన రాజకీయ వారపత్రిక లేని లోపాన్ని తీర్చవచ్చుననుకున్నారు. ఆంధ్రప్రభనుండి విరమించుకున్నప్పుడు వచ్చిన డబ్బును పెట్టుబడిగా వినియోగించదలిచారు. ఈలోగా దినపత్రిక నడపడానికి ప్రతిపాదనలు వచ్చాయి. చిరకాల అనుభవం దినపత్రికలో సంపాదించటమే కాక, పేరు ప్రఖ్యాతులు బాగాఉన్న నార్ల చివరకు దినపత్రికకే మొగ్గుచూపారు. 'ఆంధ్రజ్యోతి' అనే పేరు నిర్ణయించారు. అయితే ఆ పేరు పెట్టటానికి, హక్కులు వేరే వారి నుండి స్వీకరించవలసి వచ్చింది. విజయవాడలో ప్రచురణకర్తలు కొందరు ఇందుకు సహాయపడ్డారు. "మీరు మెచ్చిన, మీకు నచ్చిన నార్ల" సంపాదకత్వాన 'ఆంధ్రజ్యోతి' వెలువడుతున్నట్లు ప్రకటించారు. నార్ల స్వయంగా అనేక మందికి ఫోన్లు చేసి, ఉత్తరాలు వ్రాసి ఆంధ్రజ్యోతి వాటాలు కొనమని అడిగారు. పత్రికకు భవిష్యత్తు ఉండగలదని సూచించారు. నార్ల మీద ఉన్న అభిమానం, ప్రేమాదరాలు కారణంగా అనేక మంది ముందుకు వచ్చి తమ శక్తి కొద్దీ వాటాలు తీసుకున్నారు. చాలామంది తిరిగి డబ్బు వస్తుందని ఆశించి, పెట్టుబడులు పెట్టలేదు. అయినప్పటికీ తగినంత డబ్బు లేక, 'ఆంధ్రజ్యోతి' ఇబ్బందులకు గురయ్యింది. మొత్తంమీద విజయవాడ నుండి 'ఆంధ్రజ్యోతి' దినపత్రికగా 1960లో ప్రారంభమయింది. తొలుత డైరెక్టరుగా ఉన్న నార్ల ఆంధ్రప్రభ నుండి వచ్చిన డబ్బుతో వాటాలు కొన్నారు. ఆయన కుమార్తె, కుమారుడు కూడా వాటాలు తీసుకున్నారు. అయితే, నార్ల ఎడిటర్‌గా జీతం తీసుకోవాలంటే, డైరెక్టరుగా ఉండటం భావ్యం కాదనే దృష్టితో డైరెక్టరుగా తప్పుకున్నారు.

'ఆంధ్రజ్యోతి' దినపత్రిక నిలదొక్కుకొని పోటీకి తట్టుకొని కొనసాగడానికి నార్ల చేసిన కృషి ఇంతా అంతా కాదు. ఆంధ్రలోని వివిధ నగరాల గురించి

ప్రత్యేక సమాచారాన్ని సేకరించి, ప్రత్యేక సప్లిమెంటరీలు వేసి, ఆ విధంగా స్థానిక ప్రకటనలు వచ్చే ఏర్పాట్లు గావించారు. వ్యవసాయదారులకు, స్త్రీలకు ప్రత్యేక శీర్షికలను ఏర్పరచి నిపుణులచేత వ్రాయించారు. వ్యవసాయంపై గూడూరి వెంకటచలంగారు వ్రాసిన విషయాలు వ్యవసాయదారులకు బాగా ఉపయోగ పడ్డాయి. గ్రామాల వార్తలు ప్రత్యేకంగా ఇవ్వడంతో 'ఆంధ్రజ్యోతి' గ్రామీణుల పత్రికగా ప్రాధాన్యతను తెచ్చుకున్నది. కళలు, సాహిత్య విషయాలలో కూడా నార్ల ప్రత్యేక శ్రద్ధవహించి, మంచి వ్యాసాలు వ్రాయించి 'ఆంధ్రజ్యోతి'కి వన్నె తెచ్చారు. రోజూ సంపాదకీయాలు వివిధ అంశాలపై ఒక్కరే వ్రాయటమనేది తెలుగు జర్నలిజంలో ఆనవాయితీగా వస్తున్నప్పటికీ, నార్ల ఆ పద్ధతిని మార్చివేశారు. తాను వ్రాసినా, వ్రాయకపోయినా సంపాదకీయాలు ఉండాలనే దృష్టితో 'ఆంధ్రజ్యోతి'లో కొందరికి శిక్షణ ఇచ్చి ప్రోత్సహించారు. శ్రీ నండూరి రామమోహనరావు ఆ విధంగా నార్ల శిష్యరికంలో శిక్షణ పొంది, నార్ల వలె వ్రాస్తున్నాడనే పేరు తెచ్చుకున్నారు.

ఆంధ్రప్రభలో వలె శ్రీ వి. ఆర్. నార్ల 'ఆంధ్రజ్యోతి'లో కూడా ఏదైనా తీవ్రసమస్య వచ్చినప్పుడు సంపాదకీయాల పరంపర వ్రాసేవారు. ఈ విధమైన సంపాదకీయాల సీరియల్ పద్ధతి తరువాత కొందరు అనుకరించారు. నార్ల వ్రాసిన వాటిలో "సంస్కృతి"ని గురించిన సీరియల్ చాలా విలువైనది. అలాగే ఒక ఆందోళన జరిగినప్పుడు కూడా నార్ల సమస్యను విడమర్చి చూచేవారు తప్ప, ప్రవాహానికి కొట్టుకుపోలేదు. విశాఖలో స్టీల్ ఫ్యాక్టరి కావాలనీ, ప్రత్యేక తెలంగాణ, ప్రత్యేక ఆంధ్ర కావాలనీ జరిగిన ఆందోళనలలో నార్ల 'ఆంధ్రజ్యోతి'ని హేతుబద్ధంగానే నడిపారు. తెలంగాణ ఆందోళనలో వార్తలను మాత్రం పూర్తిగా ఇస్తూ, సంపాదకీయాలు ప్రత్యేక తెలంగాణాకు వ్యతిరేకంగా ఉండేవి.

1969 నుండి నార్ల హైదరాబాదులో ఉంటూ ప్రతిరోజూ సంపాదకీయాలు టెలీప్రింటర్ ద్వారా పంపేవారు. రోజూ ఆయన సంపాదకీయాన్ని హైదరాబాదులోని 'ఆంధ్రజ్యోతి' ఆఫీసులో ఉడయవర్లు అనే జర్నలిస్టు టెలిప్రింటర్‌పై పంపిస్తుండేవారు. నార్ల వ్రాత ఒక పట్టాన అందరికీ అర్థం కాదు. అందువలన అర్థం చేసుకొని చదువగల ఉడయవర్లు మాత్రమే ఈ పని చేస్తుండేవారు.

'ఆంధ్రజ్యోతి'లో నార్ల సంపాదకీయ పుస్తక సమీక్షల పద్ధతి ఒకటి క్రొత్తగా ప్రవేశపెట్టారు. తనకు బాగా నచ్చిన పుస్తకాన్ని మాత్రమే ఆ విధంగా సంపాదకీయ వ్యాఖ్యానానికి స్వీకరించేవారు. ఇంగ్లీషు పుస్తకాలను సమీక్ష చేయడం నార్ల సంపాదకత్వాన ఆంధ్రజ్యోతికి మంచి ఖ్యాతిని తెచ్చిపెట్టింది. దేశవ్యాప్తంగా సుప్రసిద్ధ ప్రచురణకర్తలు 'ఆంధ్రజ్యోతి' సమీక్షార్థం పుస్తకాలు పంపేవారు. సమీక్షించిన తరువాత వాటి ఇంగ్లీషు ప్రతిని కూడా ప్రచురణకర్తలకు పంపించే ఏర్పాట్లు చేశారు. 'ఆంధ్రజ్యోతి' సమీక్ష వలన పుస్తకాలు బాగా అమ్ముడుబోయిన సందర్భాలు కూడా ప్రచురణకర్తలకు సంతోషాన్ని, ప్రోత్సాహాన్ని ఇవ్వగా, పుస్తకప్రియులకు ఎంతో ఉపయోగకారిగా ఈ శీర్షిక తోడ్పడింది.

'ఆంధ్రజ్యోతి'లో అవసరాల సూర్యారావు చేసిన సాహిత్య దోషాలను సోదాహరణంగా చూపిన కారణంగా నార్లపై కమ్యూనిస్టులు ధ్వజమెత్తారు. గురజాడ అప్పారావు వ్రాసిన లేఖలు, మూలప్రతాలు చూచి పరిష్కరించిన సూర్యారావు చాలా పొరపాటు చేశాడు. వి. ఆర్. నార్ల వాటన్నిటినీ పరిశీలించి విషయాలు చక్కదిద్దే నిమిత్తం పురాణం సుబ్రహ్మణ్యశర్మకు కాగితాలన్నీ అప్పజెప్పి, దోషాలు చూపి వ్యాసపరంపర ప్రచురించమన్నారు. ఆయన అదే విధంగా వ్రాస్తే, తప్పులు దిద్దుకోవలసిన కమ్యూనిస్టు ప్రచురణకర్తలు, "మిగిలినదంతా కోపంలో ముగిసిందన్నట్లు" ప్రవర్తించారు.

విశ్వనాథ సత్యనారాయణ వ్యక్తిగతంగా నార్లకు స్నేహితుడైనప్పటికీ రచనలలో ఆయన అనుసరించిన ఛాందస, తిరోగమన, వర్ణాశ్రమధర్మ అనుకూలత దృష్ట్యా విశ్వనాథపై నార్ల తీవ్ర విమర్శకు పూనుకున్నారు. ఆంధ్రజ్యోతి'లో ఈ విషయమై నార్ల చేసిన వ్యాఖ్యలు, విమర్శలు చాలామందిలో ఆలోచనను రేకెత్తింప జేయగా, కొంతమందిలో దాగి ఉన్న ఛాందసత్వం బయట పడింది. అయినప్పటికీ నార్ల రాజీ పడకుండా తన విమర్శను కొనసాగించారు.

ఇందిరాగాంధి అత్యవసర పరిస్థితిని తెచ్చిపెట్టినప్పుడు వి. ఆర్. నార్ల 'ఆంధ్రజ్యోతి' ద్వారా తమ నిరసనను వ్యక్తపరిచారు. సంజయ్‌గాంధి రాక సందర్భంలో 'ఆంధ్రజ్యోతి' ప్రత్యేక సంచిక వేయటం కూడా నార్లకు ఇష్టం లేదు. అత్యవసర పరిస్థితి గిట్టని నార్ల విదేశాలలో కొన్నాళ్ళు స్వేచ్ఛా వాయువులను

పిల్చుకోవాలని యూరోప్, అమెరికా వెళ్ళారు. అయితే వేరే దేశాలలో తమ దేశాన్ని విమర్శించడం ఇష్టంలేక కేవలం మ్యూజియంలు, లైబ్రరీలు, సందర్శించ దగిన స్థలాలు చూచి వచ్చారు. వ్యక్తులను కలుసుకుంటే మాటల సందర్భంలో విమర్శ వస్తుందనే దృష్టితో ఇలా చేశారు. స్వదేశానికి తిరిగి వచ్చిన తరువాత 'ఆంధ్రజ్యోతి'లో సంపాదకుడిగా ఉండనని రాజీనామా ఇచ్చి, తొలి సంపాద కుడిగా తన పేరును పత్రికపై ప్రస్తావించవద్దని కూడా కోరారు. ఆ విధంగా 'ఆంధ్రజ్యోతి'లో 16 సంవత్సరాల పాటు సంపాదకుడిగా కృషిచేసి శ్రీ వి.ఆర్. నార్ల జర్నలిజానికి స్వస్తి పలికారు.



1958 లో మాస్కోలో నార్ల ( చిత్రంలోమధ్యనఉన్నవారు )

# విదేశీ - పర్యటనలు

శ్రీ వి. ఆర్. నార్ల ప్రప్రథమంగా 1954 లో విదేశీ పర్యటన ప్రారంభించారు. తరువాత యునెస్కో ప్రతినిధివర్గ సభ్యులుగా 1958 లో రెండవ సారి విదేశీ పర్యటన చేశారు. 1961లో, 1964లో, 1975లో, 1980లో విదేశాల పర్యటన సాగించారు. నార్ల తమ విదేశీ పర్యటనంలో వ్యక్తుల కంటె ఎక్కువగా మ్యూజియంలూ, లైబ్రరీలూ, పార్కులూ, పత్రికా సంస్థలూ సందర్శించారు విదేశీ పర్యటనానుభవాలగురించి ఆయన తన డైరీలలో క్లుప్తంగానే ప్రస్తావించారు. రాజ్యసభలో ఒకటి రెండు సందర్భాలలో మ్యూజియంల ప్రస్తావన వచ్చినప్పుడు విదేశీ మ్యూజియంల ఉదాహరణ తెచ్చారు. అనేక సందర్భాలలో తన విదేశానుభవాల గురించి గంటల తరబడి శ్రీ నార్ల చెప్పిన విషయాలు ఈ రచయిత నోట్ చేసుకోవటం వలన కొంతవరకూ ఈ అధ్యాయంలో విపులీకరించటానికి సాధ్యపడింది.

ఆంధ్రప్రభ ఎడిటర్‌గా ఉన్నప్పుడు ఒక స్వచ్ఛంద సంస్థ ఆహ్వానంపై శ్రీ నార్ల తొలిసారి విదేశీ పర్యటనకు పూనుకున్నారు. యాజమాన్యం పక్షాన శ్రీ రామ్‌నాథ్ గోయంకా ఈ పర్యటనకు అంగీకరించకపోయినా నార్ల పట్టుదలతో వెళ్ళారు. 1954 జులై 8న జెనీవా చేరుకొని 12 రోజుల పాటు అక్కడ ఉన్నారు. అక్కడ నుండి కాక్స్, బోకం, ఎస్సెన్, బాన్, హేగ్ ప్రాంతాలలో ఒక్కొక్క రోజు చొప్పున గడుపుతూ జులై 25 కు లండన్ చేరుకున్నారు. తన కున్న సాహిత్యాభిమానం దృష్ట్యా ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం, షేక్స్‌పియర్ పుట్టిన ప్రదేశం, మాంచెస్టర్ నగరం, బర్మింగ్‌హామ్ చూసి జులై 30న బ్రిటన్‌లో పార్లమెంటు (హవున్ ఆఫ్ కామన్స్) ఎలా పని చేస్తుందో గమనించారు. లండన్‌లో 15 రోజులపాటు ముఖ్యమైన సంస్థలను పరిశీలించి ఆగస్టు 18కు ప్యారిస్ చేరుకున్నారు. ప్యారిస్, వెర్సెల్, కాక్స్, జెనీవా, బాన్, జూరిచ్, రోమ్, వెనిస్, ఫ్లోరెన్స్, కైరోలలో చారిత్రక ప్రదేశాలూ, మ్యూజియంలూ, గ్రంథాలయాలూ చూచి సెప్టెంబరు 7 కు తిరిగి ఇండియా చేరుకున్నారు.

రెండవ పర్యాయం సర్వేపల్లి రాధాకృష్ణ నాయకత్వాన ఇండియా ప్రతినిధి వర్గంలో సభ్యుడుగా శ్రీ నార్ల యునెస్కో సమావేశాలలో పాల్గొనటానికి 1958 అక్టోబరు 31న ప్యారిస్ వెళ్ళారు. డిసెంబరు 8 వరకూ ప్యారిస్‌లో ఉండి, తరవాత లండన్‌లో డిసెంబరు 17 వరకూ గడిపారు బెర్లిన్, వార్సాల మీదుగా డిసెంబరు 20 నాటికి మాస్కో చేరుకున్నారు. ప్యారిస్‌లో ఉండగా ఒక రష్యన్ మిత్రుడు ఫోను నంబరు ఇచ్చి మాస్కో వచ్చినప్పుడు ఫోను చేయమన్నాడు. మాస్కో చేరుకున్న శ్రీ నార్ల తాను బస చేయవలసిన హోటల్ అడ్రస్ పోగొట్టుకున్నందున గందరగోళపడి రష్యన్ మిత్రునికి ఫోనుచేశారు. ఆనాడు సెలవైనప్పటికీ కొంతకాలంగా నగరంలో లేనందున పాత పత్రికలు తిరగేయడానికి ఆఫీసులో ఆ రష్యన్ కూర్చున్న కారణంగా ఫోనుపై దొరికాడు. అతడు మాస్కో విమానాశ్రయానికి వచ్చి నార్లను తీసుకువెళ్ళి, బస ఏర్పాట్లుచేసి కారులో మాస్కో త్రిప్పి, తన ఫ్లాట్ కూడా దూరంగా చూపెట్టాడు కాని ఇంటికి మాత్రం తీసుకువెళ్ళలేదట. టాల్‌స్టాయ్ ప్రదేశాన్ని (యాస్నాయా పొల్యా నా) డిసెంబరు 26న నార్ల సందర్శించారు. ఆయన సమాధి చూడటానికి వెళ్ళినప్పుడు ఆ చలికి గడ్డ కట్టుకుపోతానేమో అనిపించిందట. పరుగెత్తుకుంటూ వచ్చి బస చేరుకున్నాననీ, ఎముకలు కొరికే చలి అంటే ఏమిటో చవిచూచానని శ్రీ నార్ల చెప్పేవారు. తరువాత లెనిన్‌గ్రాడ్, మాస్కో, తాష్కెంట్ సందర్శించి 1959 జనవరి 1 కి ఇండియా చేరుకొన్నారు.

1964 జనవరిలో శ్రీ నార్ల మరోపర్యాయం విదేశీ పర్యటన చేశారు. ఈ పర్యటనలో కేవలం ఇంగ్లండు, ఫ్రాన్స్‌లకే పరిమితమై, సాహిత్యం, కళలకు సంబంధించిన ఆసక్తికరమైన విషయాలు తెలుసుకున్నారు 1964 జనవరి నాలుగు నుండి, ఫిబ్రవరి 1వరకూ ఇంగ్లండులో ఉన్నారు. బెర్నార్డ్‌షా ఇల్లు, సేంట్ లారెన్స్, ఆక్స్‌ఫర్డ్, స్ట్రాట్‌ఫర్డ్, బర్మింగ్‌హాం, ఎడింబరో, గ్లాస్గో, న్యూకాజిల్, అన్‌బైని, డెరెహాం ఇత్యాది ప్రాంతాలు చూచారు. ఫ్రాన్స్‌లో డా॥ జయంతి ధర్మతేజ అతిథిగా ఫిబ్రవరి 6వరకూ గడిపి ఇండియాకు తిరిగిచ్చారు.

1975 జూన్ 26న ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి దేశంలో అత్యవసర పరిస్థితి నెలకొల్పజేసింది. పత్రికలపై విపరీతమైన ఆంక్షలు

విధించారు. 'ఆంధ్రజ్యోతి' సంపాదకుడుగా ఉన్న నార్ల ఈ నిర్బంధపరిస్థితులు నచ్చక కొన్నాళ్ళు విదేశాలు వెళ్ళి స్వేచ్ఛా వాయువులు పీల్చుకోవాలనుకున్నారు. 1975 జులై 27న ప్యారిస్ చేరుకొని ఒక వారంరోజులు గడిపి ఆగస్టు 3న లండన్ చేరుకొన్నారు. అక్కడ మిత్రుల మధ్య ఒకవారం గడిపి మళ్ళీ ప్యారిస్ వచ్చి ఆగస్టు 15 నాటికి అమెరికా వెళ్ళారు. సాధ్యమైనంత వరకు వ్యక్తులను కలవకుండా, ప్రదేశాలను చూడాలని నిర్ణయించుకొన్నారు. ఇండియాను గురించి ఏదో ఒకటి మాట్లాడవలసివస్తుంది గనుక విదేశీ మిత్రులను కలియరాదను కొన్నారు. స్వదేశాన్ని బయట విమర్శించటం మంచిది కాదనీ, చేసే విమర్శ ఏదో స్వదేశంలోనే చేయాలనీ నార్ల ఉద్దేశించారు. అమెరికాలో ఆయన కుమారులూ, కుమార్తెలూ డాక్టర్లుగా ఉంటున్నందున నార్ల పర్యటన సులువయింది. 1975 ఆగస్టు 15 నుండి అక్టోబరు ఎనిమిది వరకూ అమెరికాలో వివిధ ప్రాంతాలు సందర్శించారు. వారివెంట సులోచనగారు కూడా ఉన్నారు. నేషనల్ పార్కులూ, నేషనల్ ఫారెస్టూ, జలపాతాలూ, గుహలూ - ఇట్లాంటి వాటిమీదనే ఎక్కువ దృష్టి పెట్టారు. వాషింగ్టన్‌లో కోటంరాజు ప్రతాప్ నార్లను ఆదరించారు. ఈ పర్యటనలో రెండురోజుల పాటు కెనడాలోని ఒటావో, టోరంటో సందర్శించారు.

శ్రీ వి. ఆర్. నార్ల చివరిసారిగా 1982 జులై 9న విదేశాల పర్యటనకు పూనుకొన్నారు. వారి సతీమణి సులోచనగారు కూడా వెంట ఉన్నారు. బ్రిటన్‌లో మళ్ళీ సులోచనగారి కోసం లోగడ తాను చూసిన ప్రదేశాలే సందర్శించారు కృష్ణమూర్తి చిరకాలంగా లండన్‌లో స్థిరనివాసం ఏర్పరచుకొని అరుదైన పుస్తకాలు ప్రచురిస్తున్నారు నార్ల ఆయనతో చర్చలు సాగించి అనేక సుప్రసిద్ధ పుస్తకాల షాపులను చూచి, తాను 'మక్కా'గా భావించే చేరింగ్‌క్రాస్‌లో చాలా పుస్తకాలు కొన్నారు. ఆంధ్రలో పనిచేసిపోయిన ఐరిష్ దేశస్థుడు జె. పి. ఎల్. గ్విన్ శ్రీ నార్లను లండన్‌లో రెండు సార్లు కలసి అనేక సామెతలు, నుడికారాలు, పదప్రయోగాలపై తన సందేహాలు తీర్చుకొన్నాడు. 1982 జులై 20న సుప్రసిద్ధ కవి కీట్స్ గృహాన్ని నార్ల సందర్శించారు. జులై 21న బ్లెంహైమ్‌లో చర్చిల్ పురాతన భవనాలను చూచారు. జులై 23న కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం సందర్శించారు. జులై 25 నుండీ అమెరికాలో పర్యటించారు. నార్ల సంతానంలో నలుగురు కుమార్తెలూ, ముగ్గురు కుమారులు అమెరికాలోని వివిధ ప్రాంతాలలో

ఉన్నారు. వారంతా నార్ల దంపతులను పుస్తకాల షాపులకూ, వివిధ సందర్శన ప్రాంతాలకూ తీసుకువెళ్ళారు. న్యూజెర్సీలో గొప్ప సఫారీపార్కు చూచారు. అమెరికా సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు ఎడిసన్ నివసించిన ప్రాంతాన్ని, ఐన్‌స్టీన్ గృహాన్ని, ఎడ్గార్ ఎలన్‌పో నివసించిన చోటును చూచారు కంకార్డ్‌లో ఎమర్సన్ ఇంటిని సందర్శించారు. చరిత్ర ప్రసిద్ధికెక్కిన బోస్టన్ టీ పార్టీ ఓడను నమూనా చేసి పెట్టిన దృశ్యాన్ని, లాంగ్‌ఫెలో ఇంటినీ, అమెరికా అంతరిక్ష నౌకల నమూనాలను చూచారు. ఎందరో తెలుగువారు అమెరికాలోని వివిధ ప్రాంతాల్లో నార్లను కలిసి మాట్లాడారు. తెలుగు ప్రాంతాలనుండి అమెరికా వెళ్ళి స్థిరపడిన చిత్రకారుడు ఎస్. వి. రామారావును అమెరికాలో నార్ల కలసి చర్చలు జరిపారు. అక్టోబరు చివరంతా శాన్‌ఫ్రాన్సిస్కోలో గడిపి టోక్యో, హాంగ్ కాంగ్‌ల మీదుగా నవంబరు నాటికి ఇండియా చేరుకున్నారు.

నార్ల తన విదేశీ పర్యటనను గురించి విపరంగా పర్యటన విశేషాలుగా వ్రాయక పోయినప్పటికీ తన రచనలలో, ఉపన్యాసాలలో, సంభాషణలలో వాటి ప్రభావాన్ని కనబరిచారు.



1958లో పారిస్‌లో జరిగిన యునెస్కో పదవ సాధారణ సమావేశంలో పాల్గొన్న భారత ప్రతినిధివర్గం
నిలబడినవారిలో కుడిపక్క చివర్న నార్ల ఉన్నారు.

# రచనలు

శ్రీ వి. ఆర్. నార్ల 20 సంవత్సరాలకే వ్యాసరచన ప్రారంభించగా, 24 సంవత్సరాల వయస్సులో తొలి పుస్తకాన్ని ప్రచురించారు. "స్వదేశీ సంస్థానాలు'' అనే శీర్షికతో 'భారతి' లో ముందు వ్యాసాలు ప్రచురించి తరువాత పుస్తకంగా వెలువరించారు.

## తొలి రచన : స్వదేశీ సంస్థానాలు

'స్వదేశీ సంస్థానాలు' నార్ల ప్రథమ గ్రంథం. క్రౌన్ సైజులో 105 పేజీలుగల ఈ పుస్తకాన్ని కృష్ణాజిల్లా కవుతరం నుండి ప్రచురించారు. ప్రథమ ముద్రణ శ్రీముఖ కార్తీకంలో వెలువరించినట్లు పేర్కొన్నారు. అమ్మకూ, నాయనకూ, మిత్రులకూ అంకితం ఇస్తున్నట్లు వ్రాశారు. 1931-32 ప్రాంతాల్లో స్వదేశీ సంస్థానాల గురించిన సమాచారం బొత్తిగా తెలిసేది కాదు. స్వాతంత్ర్యోద్యమంలో కూడా ఈ స్వదేశీ సంస్థానాల ప్రజలు పాల్గొనే అవకాశం లేకుండా పాలకులు నిరంకుశంగా ప్రవర్తించారు. అలాంటప్పుడు మద్రాసులో జరిగిన కాంగ్రెసు మహాసభకు వెళ్ళిన వి. ఆర్. నార్ల మూర్‌మార్కెట్‌లో "ప్రిన్సెస్ అండర్ ది బ్రిటిష్'' అనే పుస్తకాన్ని చూచారు. అయితే కొనడానికి డబ్బులేక పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన వెంకటరాజు అనే అతడివద్ద ఒక రూపాయి తీసుకొని ఆ పుస్తకం కొని చదివారు. ఆ పుస్తకం ఆధారంగానూ, పత్రికలలోని కొన్ని వ్యాసాల తోడ్పాటుతోనూ నార్ల 'స్వదేశీ సంస్థానాలు' అనే పుస్తకం వ్రాశారు. అచ్చు వేయటానికి పదిమంది మిత్రులు తలా పది రూపాయలు చొప్పున సహాయపడగా, వంద రూపాయలతో పుస్తకం బయటికి వచ్చింది. ఆరు మాసాలలో వేసిన వెయ్యి కాపీలు అమ్ముడుపోయాయి. 150 రూపాయలు మిగిలాయి. ముట్నూరి కృష్ణారావు కృష్ణాపత్రికలో ఈ పుస్తకంపై సమీక్షా సంపాదకీయం వ్రాశారు. అందువలన కూడా పుస్తకానికి బాగా ప్రచారం లభించింది. స్వదేశీ సంస్థానాలలో పరిపాలన, పన్నుల తీరు ఎలా ఉన్నదో వివరిస్తూ, ప్రజలకు స్వపరిపాలన కావాలని నార్ల అభిప్రాయం వెల్లడించారు.

## 'నేటి రష్యా' :

మొదటి పుస్తకం ఇచ్చిన ప్రోత్సాహాన్ని పురస్కరించుకొని నార్ల రెండవ పుస్తకానికి ప్రయత్నించారు. "నేటి రష్యా" శీర్షికన ముందుగా 'భారతి'లో నాలుగు వ్యాసాలు వ్రాశారు. స్నేహితుల వద్ద ఉన్న రష్యన్ గ్రంథాలు ఆధారంగా సమాచారాన్ని సేకరించారు. సుబ్బారావు అనే స్నేహితుడివద్ద రష్యన్ గ్రంథాలెక్కువగా ఉన్నట్లు పేర్కొన్నారు. పుస్తకం వేసుకోటానికి అమ్మ, చెల్లి బంగారపు గాజులు తీసి ఇచ్చారు. వచ్చిన లాభంతో మళ్ళీ గాజులు చేయించవచ్చులెమ్మని అన్నారు. "నేటి రష్యా" పుస్తకం 104 పేజీలతో వెలువడింది. ఇది కూడా కవుతరం నుండే ప్రచురించారు. 1934 జులైలో వెలువడిన ఈ పుస్తకాన్ని వెంకటరామన్న పెదనాయన గారికి అంకితమిచ్చారు. ఈ పుస్తకంలో రష్యాను ఆకాశానికి ఎత్తి చూపిన నార్ల, అనుబంధంలో సోవియట్ రాజ్యాంగ విధానం కూడా ఇచ్చారు. పుస్తకం వెలువడిన రెండు, మూడు వారాలకే ప్రభుత్వం దానిని నిషేధించి, పుస్తకాలు పట్టుకుపోయింది.

## 'ఆస్ట్రియా ఆక్రమణ' :

రెండవ ప్రపంచ యుద్ధారంభంలోనే జర్మనీ హిట్లర్ నాయకత్వాన చుట్టుపట్ల ఉన్న చిన్నదేశాలను కబళిస్తూపోయింది. అప్పట్లో హిట్లర్‌తో సంధిచేసుకున్న స్టాలిన్ ఈ ఆక్రమణల గురించి ఖండించక పోవడంతో ఇండియాలో కమ్యూనిస్టులు కూడా మౌనం వహించారు. ఆంధ్రప్రభలో అసిస్టెంట్ ఎడిటర్‌గా ఉన్న నార్ల అంతర్జాతీయ విషయాలపట్ల శ్రద్ధ వహించి, ఆస్ట్రియా ఆక్రమణపై 149 పేజీల గ్రంథాన్ని వ్రాసి 1938 అక్టోబరులో ప్రచురించారు. నవయుగ, పెదసనగల్లు అనే చిరునామాతో అది ప్రచురితమయింది. అక్కడి మిత్రులు కొందరు పుస్తక ప్రచురణకు తోడ్పడ్డారు. ఈ పుస్తకాన్ని మద్రాసులో కష్టకాలంలో తనకు అండగా నిలిచిన శ్రీ ఎస్. జి. ఆచార్యగారికి అంకితం ఇచ్చారు.

## 'జెక్ రాజ్య విచ్ఛేదం' :

రెండవ ప్రపంచ యుద్ధం సందర్భంగా ప్రజాస్వామ్యానికి వస్తున్న ముప్పుపట్ల ఆవేదన పడుతూ నార్ల 1939 జనవరిలో 186 పేజీల ఈ గ్రంథాన్ని ప్రచు

రించారు. దీనిని దాసు బావకు అంకితం చేశారు. ఇది కూడా నవయుగ, పెడసనగల్లు చిరునామాతో ప్రచురితమయింది.

## రష్యన్ కథలు :

మద్రాసులో 1935-40 మధ్య నార్లపై రష్యా సాహిత్య ప్రభావం బాగా పడింది. ఆ సందర్భంగానే రష్యన్ కథలలో 11 ఎంపిక చేసి, అనువదించి, కథకులను గురించి వివరణతో సహా 129 పేజీల ఈ పుస్తకాన్ని ప్రచురించారు. ఇందులో టాల్‌స్టాయ్, షెకోవ్, కుప్రిన్, టర్జనీవ్, డాస్టావిస్కీ ప్రభృతుల కథలు ఉన్నాయి. రామానంద చౌదరికి ఈ కథలను అంకితం చేశారు. నవయుగ, పెడసనగల్లు చిరునామాతో ప్రచురితమైన ఈ పుస్తకం 1943 ఫిబ్రవరిలో ద్వితీయ ముద్రణ కూడా చూచింది. ఆ తరువాత నార్ల అనువాదాలు మానివేశారు.

## కొత్తగడ్డ :

నార్ల వ్రాసి ప్రచురించిన తొలి నాటికల పుస్తకం "కొత్తగడ్డ". ఇందులో 16 నాటికలున్నవి. దీని ప్రచురణకు చల్లపల్లి రాజా వద్ద డబ్బు పుచ్చుకోవాలని నార్ల భావించి, ఆయన నడిగారు. రాజా డబ్బివ్వడానికి సిద్ధపడ్డారు. కాని నార్ల మనస్సు మార్చుకొని ఆ డబ్బు తీసుకోకుండా స్వతంత్రంగానే తొలి ప్రచురణ మద్రాసు నుండి వెలువరించారు. దీని ద్వితీయ ముద్రణ 1954 నవంబరులో జరిగింది. 440 పేజీలు గల ఈ గ్రంథంలో పైపంట, ప్రారబ్ధం, దాంపత్యం, శకునపక్షి, వెలుగునీడలు, కొత్తగడ్డ, ద్రోహం, ఏకాభిప్రాయం, భంగపాటు, ఇంటిగుట్టు, భావకళ, దొంగదారి, ఆడబ్రతుకు, వంతెన, అర్ధాంగి, ఆశాపాశం అనే నాటికలున్నవి. గురజాడకు దీన్ని అంకితం ఇచ్చారు. నార్లవారు, 4, పైక్రాఫ్ట్ ఫస్ట్ స్ట్రీట్, రాయపేట, మద్రాసు - 14 అనే చిరునామాతో ప్రచురించారు. 'కొత్తగడ్డ'లోని ఆశాపాశం, పైపంట, వంతెన వంటి నాటికలు చాలా చోట్ల ప్రదర్శించారు. రేడియోలో కూడా కొన్ని నాటికలు ప్రసారమయ్యాయి.

## మాటా-మంతి

1951 ఫిబ్రవరిలో 134 పుటలతో మద్రాసు నుండి ప్రచురించిన పదహారు వ్యాసాల సంపుటికి 'మాటా-మంతి' అని పేరు పెట్టారు. శారదా పబ్లికేషన్స్

మద్రాసు పేరిట ప్రచురించిన ఈ పుస్తకాన్ని కానూరి వెంకటరత్నానికి అంకిత మిచ్చారు. రూపాయిన్నర ఖరీదు పెట్టారు. ఆకర్షణీయమైన శైలిలో విషయ చర్చ జరిగింది.

## పిచ్చాపాటి

మద్రాసు నుండి 1951 ఏప్రిల్‌లో 133 పేజీల క్రౌన్ సైజు పుస్తకాన్ని పిచ్చాపాటి పేరుతో వెలువరించారు. దీని ఖరీదు కూడా రూపాయిన్నర. 12 వ్యాసాలు గల ఈ పుస్తకాన్ని నార్ల వెంకటరామన్న పెదనాయనగారికి అంకితం ఇచ్చారు. ఇందులో వ్యాసాలు ఉబుసుపోకకు వ్రాసినట్లు కనిపించినా, విషయ పరిజ్ఞానం కావలసినంత ఉన్నది. ఆకర్షణీయమైన నుడికారం ఈ వ్యాసాల నిండా కనిపిస్తుంది.

## కొత్త-పాత

శ్రీ నార్ల మద్రాసు నుండి వెలువరించిన 'మాటా-మంతి', 'పిచ్చాపాటి'తో సహా మరో 14 వ్యాసాలను చేర్చి 'కొత్త-పాత' అనే పేరుతో 242 పేజీల గ్రంథాన్ని 1975 లో ప్రచురించారు. డెమ్మీ సైజులో ఉన్న ఈ పుస్తకానికి 10 రూపాయలు ఖరీదు పెట్టారు. తన కుమారులు ముగ్గురూ మోహన్‌దాస్, లక్ష్మణ్‌దాస్, దుర్గాదాస్‌లకు అంకితమిచ్చారు.

## ప్రగతి

ఆంధ్రప్రభ నుండి పునర్ముద్రించిన నార్ల రచన ఇది. 1955 జనవరిలో వెలువడిన 42 పేజీల ఈ పుస్తకంలో సాంఘిక న్యాయాన్ని స్థాపించగోరిన మేరకు కమ్యూనిజం ప్రగతిశీలంతో కూడినదని, కాని అధమాధమ సాధనాలను ఉపయోగిస్తూ, ఇండియాలో కమ్యూనిస్టులు అభివృద్ధి నిరోధకులలో అగ్రేసరులుగా ఉన్నారని నార్ల విమర్శించారు. సంస్కృతి ప్రచురణలు, కల్చరల్ బుక్స్ లిమిటెడ్, 31, మిరాన్ సాహెబ్ వీధి, మౌంట్ రోడ్, మద్రాసు-2 చిరునామాతో ప్రచురితమైన ఈ పుస్తకానికి నాలుగణాల ఖరీదు పెట్టారు.

## పాలస్తీనా

నేడు ఇజ్రాయెల్‌గా పిలువబడుతున్న పాలస్తీనా సమస్యను 1939 లో నార్ల చర్చించి 74 పేజీల పుస్తకం వెలువరించారు. నవయుగ ప్రచురణాలయం, పెదసనగల్లు, కృష్ణ పేరిట 1939 ఫిబ్రవరిలో ఈ పుస్తకం వెలువడింది. పాలస్తీనా సమస్య లండన్‌లో గాక పాలస్తీనా లోనే పరిష్కారం కావాలని నార్ల వాదించారు. ఈ పుస్తకంలో చివరి భాగాలు 1939 మార్చి 6 వ తేదీ రాత్రి 9 గంటలకు ముగించినట్లు పేర్కొన్నారు. నార్ల సాధారణంగా తన సంపాదకీయాలలో ఈ విధంగా టైమ్‌ను ప్రస్తావిస్తుండేవారు.

## నార్లవారి మాట

"వాస్తవము-నార్ల వారి మాట'' అనే మకుటంతో 1956 డిసెంబరులో ఈ పద్యసంపుటిని మద్రాసు నుండి ప్రచురించారు. 136 పేజీల క్రౌన్ సైజు పుస్తకాన్ని ''మా ఆవిడకు'' (సులోచనగారు) అంకితం ఇచ్చారు. 1974లో మకుటం మార్చి "నవయుగాల బాట నార్ల మాట" అనే మకుటంతో 129 పేజీల డెమ్మీ సైజు పుస్తకాన్ని వెలువరించారు. దీనిని కూడా సులోచనగారికే అంకితమిచ్చారు. 'మేధావులుందురా వేదభూమిలోన' అనే మకుటంతో చివరలో కొన్ని పద్యాలు వ్రాశారు అవి అచ్చుకావలసివుంది.

## జగన్నాటకం

55 గేయాలు గల 160 పేజీల ఈ పుస్తకాన్ని 1957 మే లో ప్రచురించారు. ఇందులో జగన్నాటకం అనేది కూడా ఒక గేయం.

## మూడు దశాబ్దాలు

ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి పత్రికలలో నార్ల వ్రాసిన సంపాదకీయాలు కొన్నిటిని ఎంపికచేసి 396 పేజీల గ్రంథాన్ని ప్రచురించారు. 1944నుండి1974వరకూ ఉన్న సంపాదకీయాలలో నుంచి ఈ ఎంపిక జరిగింది. ముట్నూరు కృష్ణారావు,

ఖాసా సుబ్బారావులకు అంకితం ఇచ్చిన ఈ పుస్తకంలో తనపై జర్నలిజం ఎవరి ప్రభావం ఉన్నదీ, ఏ విధమైన సంపాదకీయాలు ఎంపిక చేసిం వి. ఆర్. నార్ల వివరించారు.

## జాబాలి

ఇది ఏకాంక రూపకం. దేవులపల్లి కృష్ణశాస్త్రికి అంకితం చేసిన ఈ పుస్తకం 1974 లో ప్రచురితమయింది. దీనికి 67 పుటల పీఠిక ఉన్నది. నార్ల తన నాటికలకన్నిటికీ ఈ విధంగానే సుదీర్ఘమైన పీఠికలు వ్రాశారు. 1981 లో నవోదయ, విజయవాడవారు దీని ద్వితీయ ముద్రణను ప్రచురించారు. ఇది కన్నడంలోకి అనువదింపబడింది.

## కన్యాశుల్కం

కేంద్ర సాహిత్య అకాడమీ వారి నిమిత్తం గురజాడ అప్పారావు "కన్యాశుల్కానికి" నార్ల ఒక కుదింపు కూర్పును రూపొందించారు. 106 పేజీలు గల ఈ డెమ్మీ సైజు పుస్తకం 1976 లో వెలువడింది.

## కదంబం

ఏడు వ్యాసాలు ఆరు కథలు గల నార్ల రచనలు ఇందులో ఉన్నాయి. యువ బుక్ డిపో, మద్రాసువారు దీన్ని ప్రచురించారు. 79 పుటలు గల ఈ పుస్తకాన్ని శ్రీ నార్ల తన భార్య సులోచన గారికి అంకితమిస్తూ, "మా ఆవిడకు కొని ఇవ్వని చీరలకూ, చేయించి పెట్టని నగలకు బదులుగా" అన్నారు.

## నరకంలో హరిశ్చంద్ర

ఈ నాటకానికికూడా నార్ల సుదీర్ఘ పీఠిక వ్రాశారు. నవోదయ, విజయవాడ వారు దీనిని ప్రచురించారు. హరిశ్చంద్ర పాత్రను చాలా నిశితంగా పరిశీలించి, అనేక గ్రంథాల ప్రమాణాలను చూపారు. దీనిని డా॥ ఎన్. ఇన్నయ్యకు అంకితం చేశారు.

## 'సీత జోస్యం'

ఈ నాటికకుకూడా నార్ల సుదీర్ఘమైన పీఠికను వ్రాశారు. 1979లో ప్రచురితమైన 'సీత జోస్యం'పై చాలా సమీక్షలు, విమర్శలు వచ్చాయి. 1981 లో కేంద్ర సాహిత్య అకాడమీవారు సీత జోస్యానికి బహుమతి ప్రకటించారు. 54 పేజీల నాటిక, 143 పేజీల పీఠిక, 12 పేజీల ప్రమాణ గ్రంథాల పట్టిక ఉన్న ఈ రచనలో రాముడి కంటె సీత పాత్ర ఉదాత్తమైనదని నార్ల వ్రాశారు. కేంద్ర సాహిత్య అకాడమీ పత్రిక "ఇండియన్ లిటరేచర్"లో అకాడమీ ఉద్యోగి ఒకరు దీనిపై అపహాస్యపూరితమైన సమీక్ష చేయటంతో నార్ల అకాడమీ అవార్డును స్వీకరించ నిరాకరించారు. అకాడమీవారు నార్లకు క్షమాపణ చెప్పుకున్నారు.

# ఇంగ్లీషు - రచనలు

## వీరేశలింగం

సుప్రసిద్ధ సంఘసంస్కర్త, సాహిత్యవేత్త, బ్రహ్మసమాజవాది అ
వీరేశలింగంపై 96 పేజీల నార్ల ఆంగ్ల రచనను 1968లో కేంద్ర సాహి
అకాడమీ ప్రచురించింది. దీనిని తమిళం, కన్నడం, అస్సామీస్, మలయా
హిందీ, మరాఠీ, బెంగాలీ భాషల్లోకి అనువదించారు. ఎన్. జి. రంగాకు
అంకితం ఇచ్చారు.

## వేమన

తొలి తెలుగు విప్లవ సంస్కర్త కవిగా వేమనను చాటి చెప్పిన ఈ ఆ
మోనోగ్రాఫ్‌ను (96 పేజీలు)నార్ల 1969లో రచించారు. కేంద్ర సాహి
అకాడమీవారు దీనిని వెలువరించారు. తమిళం, అస్సామీస్, కన్నడం, మరా
లోనూ వేమన పుస్తకాన్ని అనువదించారు.

## పాశ్చాత్యుల దృష్టిలో వేమన

వేమనను వెలికితీసి, తెలుగువారికి, ప్రపంచానికి తెలియజెప్పింది పాశ్చా
పండితులే. బ్రౌన్, కాంప్‌బెల్ మగ్‌డోనాల్డ్, బార్నెట్ అనేవారు వేమన గురిం
చెప్పిన విషయాలను నార్ల సంకలనం చేసి, తన పరిచయ వాక్యాలతో 196
లో ప్రచురించారు. సికింద్రాబాదు శేషాచలం కంపెనీవారు దీనిని వెలు
రించారు. ఇంగ్లీషులో దీని పేరు 'వేమన త్రూ వెస్టర్న్ ఐజ్'.

## ప్రాచీన భారత సంస్కృతి (Traditional Indian Culture & other Essays)

24 వ్యాసాలతో కూడిన 168 పేజీల డెమ్మీ సైజు ఇంగ్లీషు పుస్తకాని

### Gods, Goblin and Men (Extracts from the Note books of a Humanist)

నార్ల వివిధ అంశాలపై తన భావాలను నోట్ పుస్తకాలలో చిరకాలంగా వ్రాస్తూ పోయారు. వాటిని 1979లో మినర్వా అసోసియేట్స్, కలకత్తావారు ప్రచురించారు.

### Man and his wo

ఇది కూడా హ్యూమనిస్ట్ నోట్‌బుక్‌లో నుండి ఎంపిక చేసిన భావాల సంకలనమే. సైంటిఫిక్ సర్వీసెస్, హైదరాబాద్‌వారు 1982లో దీనిని ప్రచురించారు.

### గురజాడ

సుప్రసిద్ధ తెలుగుకవి గురజాడ అప్పారావుపై నార్ల వ్రాసిన ఆంగ్ల మోనోగ్రాఫ్‌ను కేంద్ర సాహిత్య అకాడమీవారు ప్రచురించారు. దీనిని తెలుగు, హిందీలోకి అనువదించారు.

### Poverty of Intellectualism in India

మైసూరు యూనివర్సిటీలో ఇచ్చిన రెండు ఉపన్యాసాలలో నార్ల, ప్రాచీన కాలంలో ఉద్దాలకుడినీ, 20వ శతాబ్దంలో ఎం. ఎన్. రాయ్‌నీ, అనుసరించి ఉంటే ఇండియా వైజ్ఞానికంగా ముందుకు పోయేదని అభిప్రాయపడ్డారు. మైసూరు విశ్వవిద్యాలయం ప్రచురించిన ఈ 75 పేజీల పుస్తకాన్ని ప్రేమనాథ్ బజాజ్‌కు అంకిత మిచ్చారు.

### Indian Culture : Its Caste Complexion

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో సోషియాలజీ శాఖ ఆధ్వర్యాన 1979లో ఇచ్చిన రెండు ఉపన్యాసాలలో కులం ఎలా పెంపొందినదీ, దానికి మతం ఎలా ఆధారంగా ఉంటున్నదీ నార్ల వివరించారు ఆ ఉపన్యాసాలే ఈ పుస్తకం.

## East and West, Myth of Dichotomy

నాగార్జున యూనివర్సిటీలో 1982లో ఇచ్చిన మూడు ఉపన్యాసాలు ఇలా 92 పేజీల పుస్తకంగా వెలువడినవి. నిరంజన్‌ధర్‌కు దీనిని అంకితమిచ్చారు. విద్యాసాగర్, ఎం. ఎన్. రాయ్ వంటి మేధావుల ఆలోచనలను నార్ల శ్లాఘిస్తూ, పాశ్చాత్య లోకమంతా భౌతికమనీ, భారత దేశమంతా ఆధ్యాత్మికమనే వాదనను సోదాహరణముగా పూర్వపక్షం చేస్తూ, ప్రమాణాలను ఉదాహరిస్తూ, వ్రాసిన ప్రసంగ సంపుటి ఇది.

## పురాణ వైరాగ్యం

ఇది అసంపూర్తి నవల. 104 పేజీలు వ్రాసి నార్ల అంతటితో వదలివేశారు.

## పంచరాత్రులు

ద్రౌపది తన ఐదుగురు భర్తలతో ఐదు రాత్రులు కాపురంచేసే విషయాన్ని ఇతివృత్తంగా స్వీకరించి ఈ నాటిక వ్రాశారు. దీనికి విపులమైన పీఠిక వ్రాయాలని తలపెట్టారు గాని, అది జరుగలేదు.

## గీత

ఇంగ్లీషులో గీతపై నిశిత విమర్శతో కూడిన రచన పూర్తి చేసి, నార్ల కొందరు మిత్రులకు కూడా పంపించి, వారి సూచనల మేరకు స్వల్ప సవరణలు చేశారు. ఇందులో గీత కాలాన్ని, ప్రమాణాన్ని, ఔచిత్యాన్ని, తత్త్వాన్ని పరిశీలించారు. ఇది ఇంకా ప్రచురించవలసి ఉన్నది.



కుటుంబసభ్యులతో నార్ల

# వివిధ రంగాలలో కృషి

శ్రీ వి. ఆర్. నార్ల ఆంధ్ర రాష్ట్ర జర్నలిస్టుల సంఘానికి అధ్యక్షుడిగా 1946 లో మద్రాసులో ఎన్నికైనారు. ఆ హోదాలో ఆ సంవత్సరమే అఖిల భారత వార్తాపత్రికల సమావేశానికి లక్నో వెళ్ళారు. ఆ తరువాత కొద్ది కాలానికే ఆ పదవికి రాజీనామా ఇచ్చారు. కాని 'ఆంధ్రప్రభ' సిబ్బంది జీతాలు, భత్యాలు పెంచాలనీ, సౌకర్యాలు ఇవ్వాలనీ యాజమాన్యంతో పోరాడుతూ అవసరమయితే సిబ్బంది పక్షాన రాజీనామా ఇవ్వటానికి కూడా సిద్ధపడ్డారు.

ఫిలిం సెన్సార్ బోర్డు సభ్యుడిగా 1948 లో నార్ల నియమితులయ్యారు. ఆయనతో పాటు దుర్గాబాయి, శేషాచలం కూడా సభ్యులుగా ఉన్నారు.

1949లో తెలుగు కళలు, నాటకాల పునర్వ్యవస్థీకరణ సంఘ సభ్యులుగా నార్ల నియమితులయ్యారు. ఇందులో నార్లతో పాటు నరసింహారావు, గోవిందరాజుల సుబ్బారావు, ఎం.ఆర్. అప్పారావు, మోటూరి సత్యనారాయణ, కె. వరదాచారి, గిడుగు సీతాపతి, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, పసల సూర్యచంద్రరావు ఉన్నారు. 1951 వరకూ ఈ సంఘం పనిచేసింది.

ఆంధ్ర ప్రభుత్వ పాఠ్య గ్రంథ విధాన నిర్ణయసంఘంలో సభ్యులుగా నార్ల 1955 లో నియమితులయ్యారు. మద్రాసు ప్రభుత్వం అంతకు ముందు పాఠ్య గ్రంథ నిర్ణయసంఘంలో నార్లను నియమించగా కొన్నాళ్ళ తరువాత రాజీనామా ఇచ్చారు.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుగు బోర్డ్ ఆఫ్ స్టడీస్‌లో సభ్యులుగా నార్ల ఉన్నారు. విజయవాడలో ఆంధ్ర అకాడమీ ఆఫ్ ఆర్ట్సు అధ్యక్షులుగా కళా పోషణకు ప్రోత్సాహాన్ని ఇచ్చారు.

1958లో రాజ్యసభకు ఎన్నికైన తరువాత నార్ల యునెస్కో సమావేశానికి భారత ప్రతినిధివర్గ సభ్యుడుగా 1958లో పారిస్ వెళ్ళి పాల్గొన్నారు.

కేంద్ర సాహిత్య అకాడమీ తెలుగు విభాగ సలహాదారుడుగా నార్ల 1957 లో నియమితులయ్యారు. అదే సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీలో జనరల్ కౌన్సిల్‌కు, ఎక్సిక్యూటివ్ కమిటీకి, ఆర్థిక సంఘానికి నియమితులయ్యారు.

రాష్ట్ర ప్రభుత్వం సమాచారశాఖను పునర్వ్యవస్థీకరించటానికి నార్ల అధ్యక్షతన ఒక సంఘాన్ని ఏర్పరచింది. ఇందులో నూకల నరోత్తమరెడ్డి, కె.ఎస్. సుబ్రహ్మణ్యం, కె. నరసింగరావు కూడా సభ్యులుగా ఉన్నారు.

కేంద్ర పురావస్తుశాఖ సలహాసంఘ సభ్యుడుగా 1958 నుండి 1961 వరకూ నార్ల ఉన్నారు.

రాష్ట్ర సంగీత నాటక అకాడమీ జనరల్ కౌన్సిల్, ఆర్థిక సంఘంలో 1960 మే నుండి సభ్యులుగా ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీలో 1961 సెప్టెంబరు నుండి జనరల్ కౌన్సిల్ సభ్యుడుగానూ, 1961 ఆగస్టు నుండి కేంద్ర లలితకళా అకాడమీలో సభ్యుడుగానూ ఉన్నారు.

రాష్ట్ర ప్రభుత్వ మ్యూజియముల సలహాసంఘ సభ్యుడుగా 1961 మార్చి నుండి పనిచేశారు.

దక్షిణ భారత భాషల పుస్తక సంస్థ సలహాసంఘ సభ్యుడిగా నార్ల మద్రాసులో పనిచేశారు.

శ్రీ వి. ఆర్. నార్ల కొన్ని సుప్రసిద్ధ గోష్ఠులలో పాల్గొన్నారు. 1955లో యునెస్కో నిర్వహించిన ఆగ్నేయాసియా ప్రాచీన సంస్కృతుల సెమినార్‌లో వార్తేరులో ముఖ్యమైన పాత్రవహించారు. ఆంగ్ల సాహిత్య అభిమానిగా 1964లో ఢిల్లీలో జరిగిన షేక్‌స్పియర్ సెమినార్‌లో పాల్గొన్నారు. గురునానక్ సెమినార్ 1969 లో ఢిల్లీలో జరుగగా అందులో నార్ల ఆసక్తికరంగా పాల్గొన్నారు.

1970 లో బెంగుళూరులో జరిగిన లెనిన్ శతజయంతి సెమినార్‌లో పాల్గొన్నారు. 1970 లో మైసూరులో జరిగిన గాంధీ శతజయంతి సెమినార్‌లో పాల్గొన్నారు. 1972లో కలకత్తాలో జరిగిన రామమోహన్ రాయ్ ద్విశత జయంతి సెమినార్‌లో పాల్గొని, నిశిత పరిశీలనతో కూడిన వ్యాసాన్ని సమర్పించారు. 1982లో మద్రాసులో జరిగిన 'సాహిత్యం సామాజిక మార్పు' అనే విషయమై జరిగిన సెమినార్‌లో పాల్గొని చర్చలలో తన అనుభవాలను వివరించారు.

ఎన్. టి. రామారావు ముఖ్యమంత్రిగా అధికారంలోకి రాగానే విద్యారంగంలో మార్పులు తీసుకురావటానికి, పాఠ్యగ్రంథాలు పునర్వ్యవస్థీకరించటానికి ఒక సంఘాన్ని నియమించాలని, దానికి వి. ఆర్. నార్లను అధ్యక్షుడిగా ఉండమని కోరారు. నార్ల తొలుత అంగీకరించి, తరువాత తాను తగినంత సమయాన్ని ఇవ్వజాలనేమోనని అభిప్రాయం వ్యక్తపరిచారు. అందువలన మార్గాంతరంగా సాంస్కృతిక వ్యవహారాల సలహాదారుడుగా ఆయనను రాష్ట్ర ప్రభుత్వం నియమించింది. రాష్ట్ర వివిధ అకాడమీలను ఎలా పునర్వ్యవస్థీకరించవలసిందీ ఆయన తన సుదీర్ఘ అనుభవంతో సూచించారు. రాష్ట్ర ప్రభుత్వం ఆ సలహాలను ఆమోదించింది. అలాగే అనేక స్వచ్ఛంద సంస్థల విషయాలలో కూడా నార్ల అభిప్రాయాలను రాష్ట్రప్రభుత్వం స్వీకరించింది. 1984 ఏప్రిల్ 30న శ్రీ వి. ఆర్ నార్ల సలహాదారుడుగా రాజీనామా ఇచ్చారు.

## అనుబంధం-1

# నార్ల తెలుగు రచనలు

1. వి. ఆర్. నార్ల : 'స్వదేశీ సంస్థానాలు' ప్రథమ ముద్రణ - శ్రీముఖ కార్తీకము, అమ్మకూ, నాయనకూ అంకితం, కవుతరం-105 పుటలు, క్రౌన్ వెయ్యి ప్రతులు.

2. వి. ఆర్. నార్ల : 'నేటి రష్యా' నార్లవారు, కవుతరం, కృష్ణా, జూలై 1934, 104 పుటలు. వెంకటరామన్న పెద నాయన గారికి అంకితం(ప్రభుత్వం నిషేధించింది).

3. వి, ఆర్. నార్ల : 'ఆస్ట్రియా ఆక్రమణ' : నవయుగ, పెదసనగల్లు కృష్ణా, అక్టోబర్ – 1938 : 149 పుటలు, ఎన్.జి. ఆచార్య గారికి అంకితం,

4. వి. ఆర్. నార్ల : 'పాలస్తీనా' నవయుగ ప్రచురణాలయం, పెదసన గల్లు, కృష్ణా, ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్, బెజ వాడ, 1939 ఫిబ్రవరి, 74 పుటలు.

5. వి. ఆర్. నార్ల : 'జెక్ రాజ్య విచ్ఛేదం', నవయుగ', పెదసనగల్లు, జనవరి 1939 - 185 పుటలు - క్రౌన్ సైజు, దాసు బాపకు అంకితం.

6. వి. ఆర్. నార్ల : 'రష్యన్ కథలు' నవయుగ, పెదసనగల్లు, 1943 ఫిబ్రవరి, ద్వితీయ ముద్రణ 129 పుటలు, 11 కథలు, టాల్‌స్టాయి, కుప్రిన్, టర్జనీవ్, డాస్టావిస్కీ, చెకోవ్, కథకుల గురించి వివరణ.

7. వి. ఆర్. నార్ల : 'మాటా మంతీ' (వ్యాస సంపుటి) శారదా పబ్లికేషన్స్, మద్రాస్, 1951 ఫిబ్రవరి, 134 పుటలు, 16 వ్యాసాలు, వెల రూ. 1-50, కానూరి వెంకట రత్నంకి అంకితం.

8. వి ఆర్. నార్ల : 'పిచ్చాపాటి' 1951 ఏప్రిల్, 12 వ్యాసాలు, 133 పుటలు, వెల రూ. 1-50, నార్ల వెంకట రామన్న పెదనాయన గారికి అంకితం.

9. వి. ఆర్. నార్ల : 'ప్రగతి' (ఆంధ్రప్రభ నుంచి పునర్ముద్రితం) సంస్కృతి ప్రచురణ, కల్చరల్ బుక్స్ లిమిటెడ్ 31, మిరాన్ సాహెబ్ వీధి, మౌంట్ రోడ్ మద్రాసు-2, 1955 జనవరి-26, వెల : నాలుగణాలు.

10. వి. ఆర్. నార్ల : 'కొత్తగడ్డ', నార్లవారు, 4 పైక్రాఫ్ట్ ఫస్ట్ స్ట్రీట్-రాయపేట, మద్రాస్ – 16, ద్వితీయముద్రణ, 1956, 16 నాటికలు, 440 పుటలు, గురజాడకు అంకితం.

11. వి ఆర్. నార్ల : 'నార్లవారి మాట' (పద్య సంపుటి) నార్లవారు, మద్రాస్. 1956 డిసెంబరు, 136 పుటలు, మా ఆవిడకు అంకితం, 'నవయుగాలబాట నార్ల మాట' (మకుటం) నవోదయ, విజయవాడ-2 ద్వితీయ ముద్రణ - 1974, 129 పుటలు, వెల రూ. 4-50.

12. వి. ఆర్. నార్ల : 'జగన్నాటకం' (గీతాలు గేయాలు) 1957, 55 గేయాలు, 160 పుటలు.

13. వి. ఆర్. నార్ల : హంస, 1964 సెప్టెంబరు, దేశికవితామండలి ప్రత్యేక సంచిక. (నార్లను గూర్చి)

వి. ఆర్. నార్ల : 'మూడు దశాబ్దాలు' (ఎన్నిక చేయబడిన సంపాదకీయ సంకలనం) నవోదయ, విజయవాడ-2 1944-74, 396 పుటలు, వెల రూ. 25-00 ముట్నూరు కృష్ణారావు, ఖాసాలకు అంకితం.

వి. ఆర్. నార్ల : 'జాబాలి' (ఏకాంక రూపకం) నవోదయ, విజయవాడ-2, 1974, 101 పుటలు వెల రూ. 4-50, 67 పుటల పీఠిక, దేవులపల్లి కృష్ణశాస్త్రికి అంకితం, ద్వితీయ ముద్రణ-డిశంబరు-1981 నవోదయ, విజయవాడ-2, 100 పుటలు వెల రూ. 10-00 పీఠిక 67 తో సహా (డెమ్మీ) కన్నడ అనువాదం-1979-హరిహరప్రియ.

వి. ఆర్. నార్ల : 'కొత్త పాత'(వ్యాస సంపుటి)(మాటామంతి, పిచ్చాపాటి వ్యాసాలతో) 14 వ్యాసాలు, 1975, 242 పుటలు, వెల రూ. 10-00 (డెమీ) మోహనదాస్, దుర్గాదాస్, లక్ష్మణదాస్‌లకు అంకితం.

వి. ఆర్. నార్ల : 'కన్యాశుల్కం'(కుదింపు కూర్పు)కేంద్ర సాహిత్య అకాడమి వారి కొఱకు, నవోదయ ప్రచురణ, 1976-106 పుటలు, వెల రూ. 4-50 (డెమి)

వి. ఆర్. నార్ల : 'కదంబం' (వివిధ రచనలు) యువ బుక్ డిపో-మద్రాస్, 6 కథలు - 7 వ్యాసాలు, 79 పుటలు, మా ఆవిడకు అంకితం.

వి. ఆర్. నార్ల : 'నరకంలో హరిశ్చంద్ర' (నాటకం-సుదీర్ఘ పీఠిక) నవోదయ ప్రచురణ, ఎన్. ఇన్నయ్యకు అంకితం.

వి. ఆర్. నార్ల : 'సీత జోస్యం' (నాటకం) 143 పుటల పీఠిక, (54 పుటలు) నవోదయ, విజయవాడ, 1979 రూ. 15-00, విద్వాన్ విశ్వంకు అంకితం, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు (నిరాకరణ).

వి. ఆర్. నార్ల : 'హిరణ్యకశిపుని హత్య', 136 పుటలు, ఏడు రంగాల రూపకం, అముద్రితం.

## అనుబంధం - 2

# V·R. Narla's Works In English

1. Veeresalingam (a monograph),
   Sahitya Akademi, New Delhi.
   1968 ; 96 pages ; Rs. 2-50.
   Translated into Tamil, Kannada, Malayalam, Hindi, Marathi, Bengali and Assamese.

2. Vemana (a monograph)
   Sahitya Akademi, new Delhi.
   1969 ; 93 pages ; Rs. 2-50.
   Translated into Tamil, Kannada, Marathi and Assamese.

3. Vemana through western eyes.
   Brown, Campbell, Mac Donald, Bennett,
   (Compiled and edited with an introduction)
   1969 ; 96 pages ; Rs. 4-50.

4. Traditional Indian Culture and other Essays,
   Vidya Books, Vijayawada - 2.
   1969 ; 168 pages, 24 articles.

5. Poverty of Intellectualism in India
   Prasaranga, Manasagangotri,
   Mysore - 57441 ; 1978 ; 75 pages.
   2 Lectures ; Rs. 6.00.

6. Gods, Goblins and Men,
   (Extracts from the notebooks of a Humanist),
   Minerva Associates,
   Calcutta - 700029 ; 1979 ; 248 pages.

7. Gurazada (a monograph),
Sahitya Akademi, New Delhi.
1979 ; Translated into Telugu and Hindi,

8. East and West : Myth of Dichotomy,
Nagarjuna University ; V. Balaiah
Endowment Lectures ; 92 pages ; Rs. 5-00.
Dedicated to Niranjan Dhar (3 lectures)

9. Excerpts from reviews of his books,
Narlavaru, Publishers and Book sellers,
C. Kubera Printers, Madras - 14.
32 pages, with Khasa introduction - 3rd page.

10. Truth about the Gita (to be published)

11. Man and his world
Pages 145, Scientific services,
Hyderabad - 20.

12. Indian cultrure : its Caste Complexion,
1152 ; Department of Sociology,
Osmania University, Hyderabad.

## అనుబంధం - 3

శ్రీ వి. ఆర్. నార్ల 1980లో ఒక ప్రత్యేక ఇంటర్వ్యూ ఇచ్చారు. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ సోషల్ సైన్స్ రిసర్చ్, దక్షిణాది విభాగం పక్షాన ఓరల్ హిస్టరీ కార్యక్రమం క్రింద ఈ ఇంటర్వ్యూను టేప్ చేశాము. ఐ. సి. ఎస్. ఎస్. ఆర్. ప్రాంతీయ విభాగ డిప్యూటీ డైరెక్టర్ పి. సత్యనారాయణ, సుప్రసిద్ధ ప్రచురణకర్త కె.బి. సత్యనారాయణ, డా॥ ఎన్. ఇన్నయ్య అడిగిన ప్రశ్నలకు శ్రీ వి. ఆర్. నార్ల ఇచ్చిన సమాధానాలను టేప్ చేశారు. నార్ల స్వంత మాటలలో చెప్పిన అనేక విషయాలు పరిశోధకులకు ఉపకరిస్తాయనే దృష్టితో అనుబంధ పాఠంగా ఈ పుస్తకంలో చేర్చాము.

అనుబంధం

# శ్రీ నార్ల వెంకటేశ్వరరావుతో ఇంటర్వ్యూ పాఠం

ప్రశ్న : మీ డేట్ ఆఫ్ బర్త్, ప్లేస్ ఆఫ్ బర్త్ అంతా మొదలుపెట్టి చెప్తారా?

జ : నేను పుట్టింది తెలుగుదేశంలో కాదు, మధ్యప్రదేశ్‌లో జబల్‌పూర్‌లో. పెరిగింది కూడా, అక్కడ ఉన్న సాగర్‌లో. బహుశ మేము నా పదవ యేట అనుకుంటా కృష్ణా జిల్లాలోని కౌతరం గ్రామానికి వలస రావడం తటస్థించింది. నాపుట్టిన తేది డిసెంబరు 1వ తేదీ, 1908 సంవత్సరంలో. మా పూర్వీకులు మిలిటరీ కంట్రాక్టర్లని వింటున్నాను. వీళ్ళు బహుశ కొంచెం ముందుగా అక్కడికి తరలి వెళ్ళారేమో అనుకున్నాను. కాని ఇటీవలి పుస్తకాలు చూస్తే నాకు తెలిసింది ఏమిటంటే సెకండ్ మాఘర్వా 1890-91 ప్రాంతాల్లో వెళ్ళడం మొట్ట మొదటిసారిగా మిలిటరీ క్యాంటీన్స్ ప్రారంభించారని తెలిసింది. మిలిటరీ కంట్రాక్టర్లుగా మా తాతలు విశేషంగా గడించినట్లు చెప్పవచ్చు. కౌతరం చేరిన తరువాత దాదాపు 50 సంవత్సరముల కనుకుంటా నేనలా తిరిగి సాగర్ వెళ్ళాను. వెళ్ళినప్పుడు అక్కడ చూస్తే అక్కడ వీధివీధికి మా తాతలు కట్టించిన ఇల్లేఅని చూపించారు. ఆ వెనుక మరొక వీధి ఉంది. అక్కడ సర్వెంటు క్వార్టర్సట. ఆ ముందు మరొక వీధిలో స్టేబిల్స్ గట్టే ఇళ్ళు ఉన్నవి. వారు తవ్వించిన బావులు వేయించిన తోటలు, కట్టించిన దేవాలయాలు కనబడ్డాయి. అందుచేత విశేషంగా గడించినట్లు కనబడుతోంది. మాతాతలు భాగ్యంతో కుబేరులయ్యారు. మాతండ్రులు ఖర్చు పెట్టడం తప్ప గడించడం తెలియక 10, 15 సంవత్సరాలలోనే మొత్తం ఆస్తి కరిగిపోయినట్లు వింటున్నాను. ఏమయినా నాపై ఈ సంఘటనల ప్రభావం నా జీవితం మీద చాలా ఉంది అనుకుంటున్నాను. అదేమిటంటే నేను 10వ సంవత్సరం వచ్చేవరకూ కొంత వరకూ మంచి స్థితిలో పెరిగిన వాడిని. అంతకు

ముందు నా తల్లికూడా మరింత మంచి స్థితిలో శ్రీమంతుని కోడలుగా కాపురం చేసినదే. చితికిపోయిన తరువాత కూడా మా తల్లిగారు మమ్మలను ఏదో చిన్న చిన్న ఉద్యోగాలు చేయమనో లేక పెద్దగా చదువు లేకుండా ఏ బడిపంతులుగా చేసో పొట్ట పోసుకోవాలని అనుకోకుండా, ఆ పూర్వపు సంపాదన తిరిగి సంపాదించాలనే ఉద్దేశంతో తన లక్ష్యంగా పెట్టుకుని ఎన్ని కష్టాలు పడినప్పటికి కూడా మమ్మల్ని పైకి తీసుకురావడానికి ప్రయత్నం చేసింది. అందువల్ల ఆ బ్యాక్ గ్రౌండు వల్ల ఈ విధమయిన లక్ష్యానికి చేరుకోవడానికి తోడ్పడిందని అనుకుంటున్నాను. ఎంత చితికి పోయినా మేము కౌతరం చేరేసరికి బహుళ 200 కాసులు బంగారం మిగిలింది. ఒక బుట్టో రెండు బుట్టలో వెండి సామానులు, 10, 15వేల క్యాష్ మిగిలింది అనుకుంటాను. వీటిలో ఒక దాని తరువాత ఒకటి అమ్ముకుని మా అమ్మ మాకు చదువు చెప్పించింది. అంతేకాదు, మరొక ఘట్టంలో మా పెదనాన్నగారు ఒకరు ముగ్గురు అన్నదమ్ములకు చదువులో సాయపడ్డారు. ఆయన ప్రతి సంవత్సరం అంటూ ఉండేవారు. మా అమ్మనూ, మమ్మల్నికూడా అంటూ ఉండేవారు. ఇంత కష్టపడి ఈ చదువులు ఎందుకు ? చిన్న చిన్న ఉద్యోగాలు ఎందుకు లేవు ? వాటిల్లో ఎందుకు చేర కూడదూ ? ఏదో కాలక్షేపం ఎందుకు చేయకూడదు? అని సలహాలు కూడా చెప్పినవి ఉన్నాయి. హేళనగా అనేవి కూడా ఉన్నాయి. అవి మా అమ్మగారికే, మాకు మనస్కరించేవి కావు. కాని నా జీవితంలో ఒక ఘట్టంలో మాత్రం ఇలాంటి ఒక ఎలిమెంటరీ స్కూల్ మాస్టరు అయ్యే ప్రమాదం కొద్దిలో తప్పిపోయింది. ఎందువల్లనంటే నేను ఉప్పు సత్యాగ్రహం కారణంగా, ఇతర కారణాల వల్ల ఇంటర్మీడియట్ తరువాత రెండు మూడేళ్ళు చదువు సంధ్యలు లేకుండా పోయాయి. నాకు ఈ సందర్భంలో కుటుంబ పరిస్థితులు కష్టంగా ఉంటే చదవ లేకపోవడం, ఇంటర్మీడియట్ రెండుసార్లు తప్పడంతో ఏదయినా ఉద్యోగం చేసుకోకూడదా అన్నారు. అప్పుడు నేనుమాకు తెలిసిన గుంటూరు తాలూకా బోర్డు ప్రెసిడెంటు పురుషాని ప్రకాశరావుగారని జ్ఞాపకం. ఆయన నాకు మా కుటుంబానికి బాగా తెలిసిన వాడు. మా మేనమామకు మంచి స్నేహితుడు. ఆయనది మంగళగిరి దగ్గర ఏదో గ్రామం. ఆ గ్రామం పేరు నాకు ఇప్పుడు జ్ఞాపకం రావడం లేదు. ఆయన దగ్గరకు వెళ్ళాను. ఏదయినా ఎలిమెంటరీ స్కూల్లో ఉద్యోగం ఇప్పిస్తారేమోనని, మంగళగిరిలో దిగి ఆ ఊరికి మూడు నాలుగు మైళ్ళు నడవవలసి వచ్చింది. బాగా ఎండలో వెళ్ళాను. నన్ను

బాగా ఎరిగున్న వ్యక్తి అయినప్పటికీ ఆయన వట్టివేళ్ళ తడికలు కట్టిన గదిలో విశ్రమించి ఉన్నాడు. నన్ను ఎగాదిగా చూసాడు. ఎందుకు వచ్చావు అన్నాడు. మంచి నీళ్ళు కావాలా అని కూడా పరామర్శ చేయలేదు. నేను వచ్చిన పని చెబితే ట్రైనింగు అయ్యావా అన్నాడు. లేదండి, కొంత కాలం ఉద్యోగం చేస్తే తప్ప ట్రైయినింగు స్కూల్లో సీట్లు దొరకవు. కనుక టెంపరరిగా ఉద్యోగం ఇస్తే తరువాత సీటు తెచ్చుకుంటాను అని అంటే ట్రైనింగు లేనిదే ఎంటర్‌టెయిన్ చేయడానికి వీలు లేదు వెళ్ళు అన్నారు. అంతే తప్ప ఎండలో వచ్చావు. ఎక్కడికి వెళతావు, ఏమిటి అని యోగక్షేమాలు కూడా విచారించలేదు. తిరిగి వెళ్ళి పోయాను. ఆయన నాకు ఉద్యోగమివ్వడానికి నిరాకరించినందువల్లనే నా జీవితం మరొక దారిన మళ్ళిందని నా గట్టి నమ్మకం. ఆయన ఉద్యోగం ఇచ్చినట్లయితే జీవితం మరొక రకంగా ఉండేది. ఇది మనస్సులో పెట్టుకుని నేను ఆంధ్రప్రభ ఎడిటర్‌గా ఉన్నప్పుడు ఆయన మద్రాసు వస్తే ఇంటికి పిలిచి డిన్నర్ ఇచ్చి మీరు నాకు మహోపకారం చేసారు. మీ మేలు జన్మలో మరువ లేను అన్నాను. అదేమిటి అని చెప్పి అంటే, అవును చాలా పెద్ద ఉపకారం చేసారు అని పాత సంగతి జ్ఞాపకం చేసాను. అంటే ఆయన మర్యాద మన్నన చేయలేదు, చాలా వికారంగా ప్రవర్తించారని చెప్పలేదుకాని, మీరు ఆనాడు ఉద్యోగం యివ్వడానికి నిరాకరించారు కాబట్టి ఈ నాడు ఈ స్థితిలో నిలబడగలిగాను అని కృతజ్ఞత తెలుపుకున్నాను.

ప్ర : మీకు టీచర్‌గా చేయాలనే కోరిక ఎందుకు కలిగింది ? వేరే అన్ని ఉద్యోగాలు ఉండగా ?

జ : బ్రతకలేక బడిపంతులు అనే ధోరణిలో తప్ప దానిలో ఏమాత్రం ఆసక్తి ఉండి కాదు.

ప్ర : అంటే మీ కుటుంబంలో ఇతర సభ్యులు ఎవరయినా టీచర్‌గా పని చేసారా ?

జ : అది కూడా ఎన్నడూ జరగలేదు. బ్రతకలేక బడిపంతులు అనే ధోరణిలో వెళ్ళడం జరిగింది.

ప్ర : ఇంతకు మునుపు ఉప్పు సత్యాగ్రహం అన్నారు కదా ? అంటే మీ మీద గాంధీ గారి ప్రభావం గానీ, కాంగ్రెసు ప్రభావం కానీ ఉండి ఉండాలి. దాని గురించి కొంత చెప్పండి.

జ : అది చాలా పెద్ద కథ. దాని గురించి తరువాత చెబుతాను. ముందు ప్రైమరీ ఎడ్యుకేషను గురించి చెపుతాను. ప్రైమరీ ఎడ్యుకేషను కొతరంలో చదువుకున్నాను. ఆదిలో నాకు హిందీ తప్ప తెలుగు రాదు. అందువల్ల ముందు తెలుగు నేర్చుకుని ఆ తరువాత తెలుగు పండిట్‌గా చేరడం జరిగింది. కొతరంలో ఒక ఎలిమెంటరీ స్కూలు ఉండేది. అక్కడ రమణయ్య గారు అని ఒక హెడ్ మాస్టరు గారు ఉండేవారు. ఆ రోజుల్లో గ్రామాల్లో అందరూ కూడా గౌరవంగా ఉండేవారు. ఆయనను చాలా నెత్తిని పెట్టుకునేవారని చెప్పవచ్చు. ఆయన కూడా చాలా హుందాగా ప్రవర్తించే వారు. ఆనాటి ఎలిమెంటరీ స్కూలు టీచర్స్‌కూ ఇప్పటికీ చాలా భేదం ఉన్నట్లుగా కనబడుతోంది. రమణయ్య మాస్టరుగారు వీధిన వెళ్తుంటే ఆయనకంటే వయసులో పెద్దవారు కూడా పెద్దపెద్ద మోతుబరి రైతులు కూడా మంచంమీద నుంచి లేచి నిలబడేవారు. వీధిలో మర్రిచెట్టు క్రింద కూర్చున్న వారు కూడా లేచి నిలబడేవారు. నమస్కారాలు పెట్టేవారు. అంత గౌరవించే వారు. మరి ఈనాడు టీచర్లకు అంత గౌరవం జరగడం లేదు. ఆ గౌరవాన్ని ఈనాటి టీచర్లు కాపాడుకోవడంలేదేమో అనిపిస్తున్నది. పాపయ్య మాష్టారు అని మరొక ఆయన ఉండేవారు. ఆయన పోస్టుమాస్టరుగా, ఎలిమెంటరీ స్కూలు టీచరుగా కూడా రెండు ఉద్యోగాలు చేసేవారు. ఆయన పొడుం దట్టించే వారు. చేతిలో రూళ్ళ కర్ర ఉండేది. చాలా స్థూలకాయుడు. ఒకసారి లేస్తే పనిలో పనిగా నలుగురయిదుగురిని వరుసగా బాదేవారు. మళ్ళీ ప్రతిసారి ఏం లేస్తాము పనిలో పని అన్నట్లు అల్లరి చేసిన వారినీ, ఇకముందు చేయవచ్చు అనుకున్న వారినీ రెండు బాది కూర్చునేవారు. ఆయనను చూస్తే అందరికీ హడల్‌గా ఉండేది. కృష్ణయ్య మాస్టరు గారని ఇంకొకరు ఉండేవారు. ఆయన చదువు బాగా చెప్పేవాడని నాకు ఈ నాటికీ ఒక మంచి ఇంప్రెషను ఉంది. ముందా లక్ష్మీనారాయణ గారని ఉండేవారు. ఆయన దగ్గర ట్యూషను చదివేవాడిని. నెలకు ఒక రూపాయి ట్యూషనుకు తీసుకునేవారు. వీళ్ళందరి దగ్గరా నేను చదివాను. కొతరంలో ఒక ప్రైవేటు మిడిల్ స్కూలు ఉంది. దానిని ఆదిలో ఒక నేషనల్ స్కూలు పద్ధతిలో రన్ చేయాలని చెరుకువాడ లక్ష్మీనరసింహంగారు హెడ్‌మాస్ట

రుగా ఆ ఊళ్ళో ఉన్న లోకల్ రైస్‌మిల్ తరఫున ప్రారంభించారు. నేను ఆ స్కూలులో చేరేసరికి ఆయన అక్కడ నుండి మారిపోయారు. కానీ వారు పెట్టి పోయిన కొన్ని సాంప్రదాయాలు ఇప్పటికీ అక్కడ ఉండేవి. అందువల్ల నేను ఆ స్కూల్లో సెకండుఫారం వరకూ చదివాను. ఆ తరువాత 3, 4, 5 ఫారాలు చదవడానికి గుడివాడ వెళ్ళాను. ఆ తరువాత మా మేనమామగారు గుంటూరులో అడ్వకేటుగా ప్రాక్టీసు మొదలు పెట్టారు. ఆయన ఇంటిలో ఉండి టౌను హైస్కూలులో స్కూలు ఫైనలు చదివాను. బుద్ధిరాజు రామచంద్రరావు గారు హెడ్‌మాస్టరుగా ఉండేవారు. నేను కౌతరంలో ఉన్న రోజులలో మిడిల్ స్కూలులో చదువుకునేప్పుడు నా పైన బ్రహ్మ సమాజ ప్రభావం పడింది. ఆ మిడిల్ స్కూలు ప్రారంభించిన చెరుకువాడ నరసింహంగారు బ్రాహ్మో. ఆయన బ్రహ్మ సమాజానికి సంబంధించిన పుస్తకాలు ప్రార్థనా గీతాలు మరెన్నో అక్కడ లైబ్రరీలో చేర్చారు. ఆయన వెళ్ళిపోయినప్పటికీ కూడా ప్రార్థనా గీతాలు చదువుతుండేవారం. ఏకేశ్వరోపాసన క్రింద పుస్తకాలు చదువుతుండేవారం. ఈశ్వర చంద్ర విద్యాసాగరుగారి జీవిత చరిత్ర ఆ రోజులలో చదవడం జరిగింది. వీర బ్రహ్మంగారి పుస్తకాలు కూడా లైబ్రరీలో ఉండేవి. అవన్నీ ఆ రోజులలో చదివిన కారణంగా బ్రహ్మసమాజ ప్రభావం నా పైన బలంగానే పడింది.

ప్రశ్న : అప్పుడు బ్రహ్మసమాజ ప్రచారానికి పత్రికలు ఏమన్నా ఉన్నాయా ?

జ : 'ధర్మసాధన' అని ఒక పత్రిక ఉండేది. ఇప్పుడు దానిని కాకినాడ నుంచి నడుపుతున్నట్లున్నారు. అప్పుడు గుంటూరు నుంచి వచ్చేది. ఆ రోజులలో కాకినాడ నుంచి పాలపర్తి నరసింహం గారనే ఆయన దానిని స్థాపించి చాలా కాలం బాగా నడిపారు. ఆయన వీరేశలింగం పంతులుగారి ప్రోత్సాహంతో వితంతు వివాహం చేసుకున్నటువంటి బ్రాహ్మో. వీరేశలింగం పంతులుగారే ఆ వివాహం స్వయంగా జరిపించినట్లు నాకు జ్ఞాపకం.

ప్రశ్న :- వార పత్రికా, మాసపత్రికా అది ?

జ : 'ధర్మసాధన' వారపత్రికగా ఉండేది. ఆ తరువాత ఆయన నాకు గుంటూరులో పరిచయమయ్యారు. ఆయన చాలా మంచివాడు. పెద్దమనిషి.

బ్రహ్మసమాజ సిద్ధాంతాలను మనస్ఫూర్తిగా నమ్మినటువంటి వ్యక్తి గుంటూరులో ఉండగా అప్పుడప్పుడూ.... పరిషత్తులకు వెళ్తుండేవాడిని. కానీ దాని ప్రభావం నా మీద అంతగా పడిందని అనుకోను. సభలకు వెళ్ళినా, ఎక్కడికి వెళ్ళినా కూడా. బుద్ధిరాజు రామచంద్రరావు గారు హెడ్‌మాస్టరుగా ఉండేవారు. ఆయన చాలా సమర్థత గల హెడ్‌మాస్టరు అని చెప్పవచ్చు.

ప్రశ్న : గుంటూరులో ఏ సంవత్సరం చదివారు ?

జ : 1926 కి అక్కడికి చేరుకున్నాను.

ప్రశ్న : హిందూ కాలేజీ అప్పటికి ఉందా ?

జ : అప్పటికి కాలేజీ లేదు. తాలూకా హైస్కూలు ఉండేది. ఆయన హైస్కూలు హెడ్‌మాస్టరుగా ఉండేవారు.

ప్రశ్న : అప్పుడు మీతో చదివిన క్లాస్‌మేట్స్ గానీ, కొలీగ్స్ గానీ ప్రముఖులయినవారు ఉన్నారా ?

జ : అంతగా జ్ఞాపకం లేదు. అప్పుడప్పుడూ ఎవరయినా వచ్చి మీ క్లాస్‌మేట్స్‌ము అని చెబుతారు. నేను ఆ రోజులలో బహుశా పది మందితో కలవడం కన్నా ఎక్కువ ఒంటరిగా బతికే వాడినని నాకు జ్ఞాపకం. పదిమందితో కలిసిన రోజులు తక్కువ అనిపిస్తోంది. ఒంటరిగా 10, 15 మైళ్ళు వాకింగ్‌కు వెళ్ళడం, లైబ్రరీలో కూర్చుని పుస్తకాలు చదువుకోవడం, ఒంటరిగా కూర్చుని ప్రార్థనలు చేయడం-ఆ ధోరణిలో ఉండేవాడినని జ్ఞాపకం. మరి అక్కడ ఉండగా బుద్ధిరాజు రామచంద్రరావు గారు నేను అంటే ఎందుకో మొత్తంమీద చాలా ఆప్యాయంగా ఉండేవారు. లేటుగా వచ్చే స్టూడెంట్సుని పేము బెత్తం పుచ్చుకుని గేటు దగ్గర నుంచోని కొట్టేవారు. నేను ఎప్పుడయినా లేటుగా వెళ్ళినా ఊరికే నోటి మాటగా మందలించేవారు తప్ప అంతగా కొట్టినట్లు జ్ఞాపకం లేదు. పైగా ఆ రోజులలో లైబ్రరీలో కూర్చుని ఇంగ్లీషు పుస్తకాలు చదువుతూండేవాడిని. అది ఆయన గమనించినట్లున్నారు. అందువల్ల అప్పుడప్పుడూ నన్ను ఇంగ్లీషు పండిట్ అనేవారు. నేను లైబ్రరీలో పుస్తకాలు ఎక్కువ చదవడం, క్లాసు బుక్స్ నెగ్లెక్ట్

చేయడం వల్ల ఫిజిక్స్ కెమిస్ట్రీలో అంతగా మార్కులు వచ్చేవి కావు ఫిజిక్స్‌లో మాస్టరు మాత్రం ఇంగ్లీషులో ఎంత పండితుడవయినా ఇంగ్లీషే కాదు ఇవి కూడా జాగ్రత్తగా చదివితేనే కాని స్కూలు ఫైనల్ దాటలేవు అని మందలిచ్చినట్లు జ్ఞాపకం కాని తీరా ఆ సంవత్సరం పరీక్షకు కూర్చుంటే ఫిజిక్స్‌లోనే మార్కులు ఎక్కువ వచ్చాయి. ఇంగ్లీషులోనే తక్కువ వచ్చాయి. ఆ సంవత్సరం మొత్తం మీద పేపరు చాలాకష్టంగా ఉంది. అందువల్ల మోడరేషన్ పెట్టి 100కి 30 మార్కులు తెచ్చుకున్న వారిని పాస్ చేయమన్నారు, కాని దురదృష్టవశాత్తు నాకు 30 కూడా కాదు, 29 మార్కులే వచ్చాయి. అప్పుడు బుద్ధిరాజు రామచంద్రరావు గారు నా మీద ఉన్న ప్రేమానురాగాలను బట్టి బోర్డుకు స్వయంగా ఒక లెటరు వ్రాసారు. ఏమనంటే ఇది ఎక్సెప్షనల్ కేసు. ఇతను ఇంగ్లీషులో మంచి స్టూడెంటు. ఎందుకు ఇలా జరిగింది. అందువల్ల నామాట మన్నించి 29 వచ్చినా పాస్ చేయాలని వ్రాసారు. అక్కడి నుంచి రూలు రూలే. రూల్సు మార్చడానికి వీలు కాదని చెప్పి జవాబు వచ్చినట్లుంది. అందువల్ల స్కూలుఫైనలు రెండవ సారి చదవవలసి వచ్చింది. అప్పుడు పాస్ అయ్యాను.

ప్రశ్న : అప్పట్లో విద్యార్థుల మీద రాజకీయ ప్రభావం ఎలా ఉండేది ? విద్యార్థుల ఉద్యమాలు జరిగాయా ?

జ : కొంత ప్రభావం ఉండేది కాని మరీ అంత లేదు. ఆ తరువాత బాగా వచ్చింది. భగత్‌సింగు, బి. కె. దత్, .... దాసు వగైరాలు తరువాత ఏడాదికి కానీ ప్రాధాన్యంలోకి రాలేదు. అప్పుడు విద్యార్థుల్లో ఎక్కువ ప్రభావం వచ్చింది కానీ 1926, 1927లో రాజకీయాల పట్ల నాకే కాదు, తక్కిన విద్యార్థులకు కూడా అంత ఆసక్తి ఉండేది కాదు.

ప్రశ్న : ఆంధ్ర ఉద్యమ ప్రభావం ఏమయినా ఉండేదా ?

జ : ఆ ప్రభావం కూడా అంతగా కనపడేది కాదు. నాకు తెల్సినంత వరకూ ఏమీ ఉండేది కాదు, ఆ తరువాతనే విద్యార్థులు రాజకీయాలవైపు రావడం జరిగింది. బహుశ వీరేశలింగం గారికి ఆ కాలంలో సాంఘిక విషయాల

తిరిగి రాజకీయాల పట్ల, ఇతర విషయాల్లో విద్యార్థులు ఆసక్తిని చూపించడం ఈ భగత్‌సింగు ప్రభావం వల్లనే జరిగిందేమో అని ఈ ప్రశ్న మీరు అడిగిన తరువాత నాకు అనిపిస్తున్నది. అంతకు ముందు దీని గురించి ఆలోచించ లేదు. ఈ ప్రశ్న వేశారు కనుక బహుశ గ్రూప్ ఆఫ్ యంగమన్ కారణంగా జరిగిందేమో అని ఇప్పుడు అనిపిస్తోంది. స్కూలు ఫైనలు పాసయిన తరువాత గుంటూరులో చదవాలని అనిపించ లేదు అందువల్ల అక్కడినుంచి తప్పుకోవాలంటే అక్కడ లేని గ్రూపును ఒకటి తీసుకోవలసిన అవసరం బాగా తోచింది. లేకపోతే మేనమామ గారి ఇల్లు ఎందుకు వదిలిపెట్టిపోయాడు అనే మాట రావచ్చు కదా. అందువల్ల ఇష్టం లేక పోయినా వేరే గ్రూపు తీసుకోవలసివచ్చింది.... కాకినాడ వరకూ వెళ్ళిపోయాను. కాకినాడ వెళ్ళడం ఒక విధంగా మరీ మంచి దయింది ఎందువల్లనంటే అక్కడ ఈ బ్రహ్మ సమాజ వాతావరణంలో పడడం అక్కడ ఐడియలిస్టు టీచర్సు బుద్ధిరాజు రామచంద్రరావు గారి కంటే మంచి టీచర్సుతో - ఈయన కేవలం టీచింగులో తప్ప ఇతర విషయాల్లో ఆశయాలు ఏవీ ఉన్న వాడు కాదు. అయినా మంచి టీచరు. డిసిప్లిన్ బాగా మెయిన్‌టెయిన్ చేసేవారు. పిల్లల పట్ల శ్రద్ధాసక్తులు చూపించేవాడు. అంతకు మించి పెద్ద వైడర్ యాస్పెక్ట్స్ ఉన్నవాడు కాదు కాకినాడ వెళ్ళేసరికి అక్కడ వేమూరి రామకృష్ణారావు గారు ప్రిన్సిపాలుగా ఉండేవారు. పెద్దాడ రామస్వామి గారు ఇంగ్లీషు టీచ్ చేసేవారు. ఉప్పల లక్ష్మణరావుగారు బాటనీ డిపార్టుమెంటు సీనియర్ లెక్చరరుగా ఉండేవారు. గోపరాజు రామచంద్రరావుగారు జూనియర్ లెక్చరరుగా ఉండేవారు. లక్స్టెట్టీ అని బెంగాలీ అతను ఇంగ్లీషు చెప్పేవారు. పాల్ అని ఇంకొకతను బెంగాలీ, ఫిజిక్సో కెమెస్ట్రినో చెప్పేవారు. ఈ విధంగా చాలా మంచి టీచర్సు ఉండేవారు. కొంతవరకూ వైడర్ ఫీల్డులోకి వెళ్ళినట్లు కొంత విశిష్ట లక్ష్యాలు ఉన్న వాతావరణంలోకి వెళ్ళడం జరిగింది. అక్కడికి వెళ్ళిన తరువాత క్లాసు పుస్తకాల పట్ల మరింత శ్రద్ధ తగ్గింది. ఈ వాతావరణంలో పడేసరికి ఎక్కువగా రీడింగు రూములో కూర్చుని మాగజైన్సు ఎక్కువ చదువుతుండే వాడిని. అప్పుడు మాగజైన్సులో మంచి బొమ్మలు, వ్యాసాలు పడితే పిల్లలు చించుకు పోతుండేవారు. అలాగ చించుకు పోయేవాడిని కాదని రీడింగు రూము కీపరు గమనించినట్లు ఉన్నాడు. ఎప్పుడయినా తను బయటకు పోయినట్లయితే నన్ను ఇన్ ఛార్జిగా పెట్టి పోయేవాడు. నేను అక్కడ కూర్చుని వి మోడరన్ రివ్యూ. ఇండియన్

రివ్యూ ఇలాంటి పత్రికలు చాలా చదువుతుండేవాడిని. అది బ్రహ్మసమాజం ఇన్‌ఫ్లుయెన్సు ఉన్న కాలేజీ కనుక దానికి సంబంధించిన పుస్తకాలు, పత్రికలు వగైరాలు విశేషంగా వస్తుండేవి.

ప్ర : అప్పుడు ముఖ్యమయిన తెలుగు పత్రికలు ఏముండేవి ?

జ : తెలుగు పత్రికల మీద పెద్ద ఆసక్తి చూపించేవాడిని కాదు. ఎక్కువగా మోడర్న్ రివ్యూ, ఇండియన్ రివ్యూ చదువుతుండేవాడిని. అప్పుడప్పుడూ 'ధర్మసాధన' చూస్తుండేవాడిని. ఆంధ్రపత్రిక పెద్దగా చదివే వాడిని కాదు. కృష్ణాపత్రిక అప్పుడు అంత అలవాటయినట్లుగా తోచదు. పోతే మద్దూరు అన్నపూర్ణయ్యగారు నడిపే 'కాంగ్రెసు' పత్రిక చదివేవాడిని. ఆ జిల్లాలో దానికి చాలా ప్రచారం ఉండేది. అందుచేత కాకినాడ వెళ్ళిన కొద్ది కాలంలోనే ఆయనతో నాకు పరిచయం అయింది. నేనంటే చాలా ప్రేమాదరాలు కలిగి ఉండేవారు. అక్కడ ఉండగానే బ్రహ్మసమాజం ఇన్‌ఫ్లుయన్సు వల్ల కొంత సోషల్ రీఫారమ్స్ చేయాలనే ఉద్దేశంతోనూ, ఇతర విధానాల్లో ప్రజాసేవ చేయాలనే ఉద్దేశంతో 'సోదర సమితి' అని ఒక సంస్థ ప్రారంభించాము.

ప్ర : ఇదంతా ఏ సంవత్సరంలో జరిగింది ?

జ : కాకినాడలో 1928-30 సంవత్సరాల మధ్య జరిగింది.

ప్ర : అప్పుడేమయినా మీరు వ్యాసాలు వ్రాయడం జరిగిందా ?

జ : అక్కడ సోదర సమితి వారము ఒక మాన్యుస్క్రిప్ట్ మాగజైన్ పెట్టాము.

ప్ర : దాని పేరేమిటి ?

జ : 'యువజన' అని పెట్టాము. మొట్టమొదటి తెలుగు వ్యాసం వ్రాసాను.

ప్ర : దేని మీద వ్రాసారు ?

జ : దానిని "నేను కమాల్ పాషాను అయితే" అనే పేరుతో వ్రాసాను. కమాల్ పాషాను అయితే పిలకలన్నీ గొరిగిస్తాను, జంధ్యాలన్నీ పీకిస్తాను అని ఈ

విధంగా వ్రాసాను. ఎందుకంటే కొంతమంది అనాటి క్లాసుమేట్సు ఈనాటికీ ఆ వ్యాసం రిఫరెన్సు తెస్తారు. 'నేను కమాల్ పాషానయితే' అనే హెడ్డింగుతో వ్రాసాను. అప్పుడు ఈ కమాల్ పాషా సోషల్ రిఫారమ్సు, సోషల్ యాక్టివిటీస్ గురించి ఎక్కువ చదువుతుండేవాడిని. అందువల్ల నేను కమాల్ పాషాను అయితే అనే హెడ్డింగుతో వ్రాసాను.

ప్ర : ఏ సంవత్సరం?

జ : 1928 లో జరిగింది.

నేషనల్ కాంగ్రెసు కమిటీ సమావేశం మద్రాసులో జరిగింది. ఆ సంవత్సరమే దానికి తల్లిదండ్రులను వేధించి కొంత డబ్బు సంపాదించి మద్రాసు వెళ్ళాను. మొట్ట మొదటి సారిగా వెళ్ళి చూచిన కాంగ్రెసు మద్రాసు కాంగ్రెసు. అక్కడ నాకు తెలిసిన ఒకతను టికెట్లు, విజిటర్సు గ్యాలరీ టిక్కట్లు, సబ్జక్ట్సు కమిటీ టిక్కట్లు మధ్యమధ్య నాకు ఇస్తూ పోయేవాడు. అందువల్ల నేను లోపలికి వెళ్ళి సెషన్సు కూడా చూడడం జరిగింది. అప్పుడు ఫిలసాఫికల్ కన్వెన్షను జరుగుతుండేది. ఆ చర్చలు అవీ కూడా చూచాను. ఆ కాన్ఫరెన్సులో గాంధీగారికి వ్యతిరేకంగా కూడా ఉండేది. నెహ్రూ, శ్రీనివాస అయ్యంగార్ల ప్రోద్బలంపైన మన భారత ప్రజల లక్ష్యం సంపూర్ణ స్వాతంత్ర్యం అనే తీర్మానం చేసారు. దానికి గాంధీ గారిని విమర్శించారు. కానీ అప్పుడు ఉన్న యువకులు ఆ తీర్మానం హర్షించారు. నెహ్రూగారు కూడా దానిని సమర్థించేవారు. శ్రీనివాసయ్యంగారు కూడా దానికి ప్రధాన కారణం.........ప్రెసిడెంటు అని జ్ఞాపకం ఆ కాంగ్రెసులో. అయితే ఆ కాంగ్రెసు ప్రభావం నా పైన చాలా ఉండేది. ఆ తీర్మాన ప్రభావంకూడా చాలా ఉండేది. తరువాత కలకత్తా కాంగ్రెసు వచ్చే సరికి గాంధీగారి సూచనపైన దానిని తగ్గించారు. తగ్గించి ఒక ఏడాది లోపల డొమినియన్ స్టేటస్ ఇస్తే తృప్తి పడతాము, ఈ సంపూర్ణ స్వాతంత్ర్య లక్ష్యాలను తగ్గించుకుంటాము అని మరొక తీర్మానం చేసారు. ఆ తీర్మానం చేసేటప్పుడు నాకు చాలా బాధ కలిగింది. చాలా ఆగ్రహం వచ్చింది. ఇది వెనుకడుగువేయడంగాతోచింది. అందువల్ల చాలా ఉద్రేకపడుతూ నేను అన్నపూర్ణయ్యగారి పేరిట ఒక ఉత్తరం వ్రాసాను. ఈ విధంగా చేయడం వల్ల దేశద్రోహమే చేసారు. జాతి ద్రోహమే చేసారు అనే ధోరణిలో ఏమేమో వ్రాసి వుంటాను. ఇప్పుడు అంతగా జ్ఞాపకం లేదు. చాలా

ఉద్రేకపడుతూ వ్రాసాను. ఆయన ఆ పత్రికలో ఒక యువమిత్రుడు ఈ విధంగా వ్రాస్తున్నాడు అని పేరు పెట్టకుండా అది 'కాంగ్రెసు' పత్రికలో అచ్చు వేసారు. అదే నా మొదటి రచన అచ్చుకావడం. అందువల్ల అది చూచిన రోజులలో నేల మీద నడవలేదు. గాలిలోనే నడిచినానని చెప్పవచ్చు. ఇది 1929 లోనో 1930 ప్రారంభంలోనో కావచ్చు.

ప్ర : సోదర సమితిలో సభ్యులుగా ఎవరుండేవారు?

జ : సోదరసమితిలో డజను మంది ఉండేవారు. దానిలో సగానికి పైగా ఎంతోకొంత ప్రాధాన్యంలోకి వచ్చిన వారే. వారిలో తిమ్మరె సత్యనారాయణరావు అని ఒకతను రిజర్వు బ్యాంకులో చాలా పెద్ద పొజిషన్‌లోకి వచ్చాడు. రూరల్ క్రెడిట్ గురించి సర్వేకి కాబోలు ఆయన ప్రత్యేకించి ఒక రిపోర్టు వ్రాసాడు. ఆ రిపోర్టు చాలా చక్కగా వ్రాసాడని కొంతమంది అనగా విన్నాను. మన కామ్రేడ్ మీనన్ అని కాబోలు .... వ్యాసాలు వ్రాస్తుంటాడు. ఆయన హిందూ-లిటరేచరులో ప్రధానంగా చెప్పుకోతగింది ఈ రూరల్ క్రెడిట్ సర్వే రిపోర్టు అని చెప్పి ఎక్కడో అన్నాడు. అందువల్ల ఆయన ఆ రోజులలో కూడా వ్యాసాలు బాగా వ్రాసేవాడు. ఇంగ్లీషులో కూడా బాగా వ్రాసేవాడు. ఫస్ట్‌క్లాస్ తెచ్చుకున్నాడు. కొంత లక్ష్యాలు, ఆదర్శాలు ఉన్నవాడు. కష్టపడి పనిచేసేవాడు. వెరీ ఆనెస్టు ఆఫీసరు. ఇంకొకాయన గూడూరు వెంకటచలం. నేషనల్ సీడ్స్ కార్పొరేషన్ ఎం.డి. గా పని చేస్తూ హార్టు ఎటాక్ వచ్చి చనిపోయాడు. సోదర సమితి మెంబరు ఆనాటి స్నేహితుడు రామలింగస్వామి, ఫార్మాస్యూటికల్స్ ఇన్‌స్టిట్యూట్‌లో పేరు తెచ్చుకున్నవాడు. పైడిమర్రి సత్యనారాయణ అని ఆయన రెండు మూడు సార్లు జైలుకు వెళ్ళాడు. దేశ సేవచేసాడు. కోనపల్లి సుబ్రమణ్యం ఇతను కూడా రెండు మూడు సార్లు దేశసేవ గురించి జైలుకు వెళ్ళాడు. హెడ్‌మాస్టరుగా పని చేసి రిటైరయ్యాడు. ఈ విధంగా మేమంతా ఉండే వాళ్ళం. మేము కూడా కొంత సోషల్ సర్వీసు చేస్తుండే వాళ్ళం. ఒక మాన్యుస్క్రిప్ట్ మాగజైన్ నడుపుతుండే వాళ్ళం. ఆ రోజుల్లో తుఫాను వస్తే సైక్లోన్ రిలీఫ్ అని కొంత సేవ చేసాము. వినాయక చవితి వచ్చినప్పుడు భోగం మేళాలు వీధివీధికీ పెట్టేవారు. బ్రహ్మ సమాజ ఇన్‌ఫ్లుయన్సు వల్ల వెంకటరత్నం నాయుడుగారి ఇన్‌ఫ్లుయన్సు వల్ల యాంటీనాచ్ ప్రాపగాండా అని చెప్పి దానిని కొంత కాలం చాలా ముమ్మరంగా

సాగించాము. నేనే ఒక పెద్ద బకెట్ నిండా ఉడకబెట్టిన మైదా పిండి పుచ్చుకుని చేత్తో వ్రాసిన పోస్టర్సు రెండు, మూడు వందలు ఒక రాత్రి అంతా గోడలకు అంటించినట్లు జ్ఞాపకం.

ప్ర : అప్పటికి మీమీద రష్యన్ రివల్యూషన్ ప్రభావం ఏమన్నా కలిగిందా?

జ : అప్పటికి లేదు.

ప్ర : ఎందుకంటే 1933 ప్రాంతంలో సోవియట్ రష్యా పబ్లిష్ అయ్యింది కదా?

జ : అప్పటికి లేదు. అప్పటికి ఇంకా బ్రహ్మసమాజ ఇన్ఫ్లుయన్సు చాలా ఎక్కువగా ఉంది.

ప్ర : మీరు కూడా చూసే ఉంటారు. ఈ మధ్య కంభంపాటి సత్యనారాయణ గారి బుక్ ఒకటి వచ్చింది. దానిలో 1934 లో 18 ఆగస్టు కృష్ణా పత్రికలో మీ సంపాదకీయం ఉన్నట్లు వ్రాసారు.

జ : అప్పటికి నేను వ్రాసిన మాట నిజమే కానీ ఈ ఘట్టం చెప్పిన నాటికి ఇంకా లేదు.

ప్ర : మద్రాసు థియాసఫీ సభకు హాజరయ్యారు కదా, అప్పుడు అనిబిసెంటును వాళ్ళను చూసారా?

జ : అక్కడికి వెళ్ళినప్పుడు అనిబిసెంటును దూరంగా ఉండి చూచినట్లు జ్ఞాపకం. ఎక్కువ టైము కాంగ్రెసు పండాలులో జరిగింది. చాలా పుస్తకాలు చాలా చౌకగా అమ్మారు. ఆ రోజులలో పుస్తకాలంటే చాలా ఆసక్తి ఉండేది. అందువల్ల పావలాకు అర్ధరూపాయికి పుస్తకాలు అమ్ముతుంటే పది రూపాయలు పెట్టి బండిల్ ఆఫ్ బుక్స్ కొన్నట్లు గుర్తు.

ప్ర : జిడ్డు కృష్ణమూర్తి గారిని చూసారా ?

జ : జిడ్డు కృష్ణమూర్తిగారిని మొదటిసారి అక్కడే చూసాను. కాని బ్రహ్మసమాజ ఇన్‌ఫ్లుయన్సు పడినంతగా వాళ్ళ ప్రభావం నా మీద పడలేదు. ఎర్లియర్ ఏజ్‌లో బ్రహ్మసమాజ ప్రభావం విశేషంగా ఉంది.

ప్ర : అప్పుడున్న ప్రముఖ ఆంధ్ర రాజకీయ నాయకులు ఎవరు? మద్రాసులో కాంగ్రెసు సెషనుకు పోయినప్పుడు ?

జ : తెలుగు ప్రాంతంలో - ముఖ్యంగా కాకినాడ వెళ్ళిన తరువాతనే కాంగ్రెసు వారయిన మద్దూరు అన్నపూర్ణయ్యగారు పరిచయమయ్యారు. ఆయన కాంగ్రెసు నాయకులలో చాలా పెద్దవారు. మొదటి వాడు. ఆ తరువాత అప్పుడప్పుడూ కొతరం మా ఊరు కూడా వచ్చేవారు. కాకినాడ వస్తే తప్పకుండా నన్ను చూచేవాడు. మాతో గంటలు రోజులు గడుపుతుండేవాడు. అనేక రకాల ఎంకరేజ్‌మెంటు ఇస్తుండే వారు. ఆ తరువాత పత్రికలకు వ్యాసాలు ఎందుకు వ్రాయకూడదు అంటే నేను 'కాంగ్రెసు'కు వ్యాసాలు వ్రాస్తుండేవాడిని. మొదటి వ్యాసంతో ఆగలేదు. తరువాత కూడా మారు పేర్లతో రవీంద్ర అని, ఉపేంద్ర అని, ఇంద్ర అని వ్రాస్తుండేవాడిని.

ప్ర : మీ పేరు మీద మొదటగా వ్రాసింది ఎప్పుడు?

జ : నా పేరుతో నేను వ్రాసిన వ్యాసం బహుశ కృష్ణా పత్రికలో ఉప్పు సత్యాగ్రహం రోజులలో పుస్తకాలు చదివి ఉప్పు పన్నులో ఉన్నటువంటి అన్యాయాలను గురించి ఒక వ్యాసం వ్రాసాను. దానిని కృష్ణారావు గారు వేసారు.

ప్ర : ఇప్పుడా 'కాంగ్రెసు' పత్రికలు దొరుకుతాయా?

జ : నాకు తెలియదు, నా దగ్గర లేవు. లింగరాజుగారి దగ్గర దొరకవచ్చు.

ప్ర : రాజమండ్రిలో కూడా అడిగాను. లేవు అన్నారు. ఇంటర్‌మీడియట్ ఎడ్యుకేషను తరువాత చెప్పండి.

జ : ఇంటర్మీడియట్ ఎలాగో రెండు మూడు సార్లు ధక్కా-మొక్కీలు తిని ఎలాగో పాస్ అయ్యాను. ఆ తరువాత కాకినాడ వదిలి వచ్చాను. తరువాత బయాలజీ గ్రూపు కూడా వదిలివేసాను. హిస్టరీ ఎకనామిక్స్ తీసుకుని బందరులో నోబుల్ కాలేజీలో చేరాను. అప్పటికే మధ్యలో రెండు మూడు సంవత్సరాలు చదువు మానేయడం అటు ఇటు తిరగడం, ఆ సందర్భంలో మా పెదనాన్న గారిని నా ఎడ్యుకేషన్‌కు ఫైనాన్స్ చేయమని అడగడం మర్యాదగా తోచలేదు. అందు వల్ల జర్నలిజం ద్వారా కొద్దో గొప్పో సంపాదిస్తూ నేనే చదవాలనేపట్టుదలతో ఆ పని ప్రారంభించాను. అప్పుడు ఏదయినా పత్రికకు వ్యాసం వ్రాస్తే రు. 5/- లు ఇస్తుండేవారు.

ప్ర : ఏ ఏ పత్రికలకు వ్రాసేవారు ?

జ : ప్రజామిత్ర పత్రిక బెజవాడనుంచి వచ్చేది. దానికి వ్రాస్తే గూడవల్లి రామబ్రహ్మం గారు రు. 5 లు ఇచ్చేవారు. భారతికి ఎప్పుడయినా వ్యాసం వ్రాసి పంపిస్తే, యాక్సెప్టయితే వ్యాసానికి రు. 25 లు ఇచ్చేవారు. చాలా మంచి పేమెంటు ఆ రోజులలో. వ్యాసాలు తీసుకుని పత్రికలలో వేస్తే డబ్బు యిస్తారనే సంగతి నాకు మొట్టమొదటగా తెలియదు. అది ఎవరో చెబితే నాకు చాలా పెద్ద విశేషంగా, అబ్బురంగా తోచింది. మనం వ్రాసిన వ్యాసం వేయడమే కాకుండా డబ్బు కూడా ఇస్తారని తెలిసి. ముఖ్యంగా భారతి వారు వ్యాసానికి రు. 25 లు ఇస్తారని తెల్సింది. దానికి వ్యాసం వ్రాసి పంపాను. అదేమిటో ఇప్పుడు నాకు జ్ఞాపకం లేదు. అది అచ్చయింది. భారతిలో అదే నా ఫస్టు ఆర్టికల్. నాపేరుమీద నార్ల వెంకటేశ్వరరావు పేరు మీద అచ్చయింది. మారు పేరుతో కాదు. ఇది 1932-33 ప్రాంతంలో జరిగింది. గన్నవరపు సుబ్బరామయ్య గారు భారతికి ఎడిటర్‌గా ఉండేవారు. వ్యాసం అచ్చయింది. ఆ పత్రిక నాకు వచ్చింది. నెల రెండు నెలలు అయ్యింది. కానీ డబ్బు రాలేదు. డబ్బు ఇస్తారనే మాట నిజమా? వట్టిదా? లేకపోతే నేను చిన్న వాడిని కనుక నాకు ఇవ్వనక్కరలేదు అనుకున్నారా? అని మధన పడ్డాను. ఎందుకయినా మంచిదని ఒక ఉత్తరం వ్రాసాను. వ్యాసం మీరు వేసుకున్నారు. డబ్బు ఇస్తారని విన్నాను. కానీ పంపలేదు. పోనీ ఒక ఏడాది పాటు 'భారతి' ఉచితంగా పంపడానికి అయినా సాధ్యమా అని వ్రాసాను. వ్రాస్తే వెంటనే భారతి పంపిస్తామని లెటరు వ్రాసారు. ఆ తరువాత రు. 25 లు

మనిఆర్డరు కూడా వచ్చింది. అది మరింత ఆశ్చర్యాన్ని కలుగజేసింది. మొట్ట మొదటి సారిగా ఒక పత్రికనుంచి రు. 25 లు ఒక వ్యాసానికి వస్తే మా అమ్మ కూడా అబ్బురపడింది. ఎందుకంటే ఆ రోజులలో ఎలిమెంటరీ స్కూలు టీచర్‌కి జీతం రు. 7 లు. ఒక వ్యాసం వ్రాస్తే 3 నెలల జీతం వచ్చిందని మా అమ్మ అబ్బురపడింది. ఆ తరువాత కృష్ణా పత్రికకు వ్రాసేవాడిని. కృష్ణారావు గారు డబ్బు ఇచ్చేవారు కాదు. తరువాత కొన్ని సందర్భాలలో నాకు ఆయన బోల్డ్‌గా చెప్పారు కూడా. 30, 40 సంవత్సరాల నుంచీ పత్రిక నడుపుతున్నాను. ఎవరికీ ఒక్క కానీ ఇచ్చిన పాపాన పోలేదు అని. అది ఘనమయిన విషయంగా చెప్పుకునేవారు. ఎప్పుడయినా వ్యాసాలు తీసుకువెళ్ళి ఇచ్చినట్లయితే వేసేవారు. ఎంకరేజ్ చేసేవారు. కానీ ఆయన హయాంలో డబ్బు ఇచ్చేవారు కాదు.

ప్ర : ఇది బి.ఏ. చదువుతుండగా జరిగిందా?

జ : బి. ఏ. చదవడానికి కొంచెం ముందుగా కూడా వ్రాసాను. మొట్టమొదటిసారి నాకు బాగా జ్ఞాపకం. అది ఉప్పు పన్ను వగైరాల గురించి వ్యాసం తీసుకున్నారు. కృష్ణారావుగారు పేరుకలవారు. ఆయన దగ్గరకు వెళ్ళడానికి సంకోచం, బిడియం, భయం. అందువల్ల తటపటాయిస్తూ వెళ్ళి అంత దూరాన నిలబడి వ్యాసం వ్రాసాను, ఒకసారి చూడండి, బాగా ఉంటే వేయండి అని అక్కడ పెట్టాను. అది ఆయన తీసుకున్నారు. అలాగే అని తల పంకించారు. నేను నా దారిన వెళ్ళిపోయాను. ఆ తరువాత ఆ వారంలోనే దానిని ప్రచురించారు. నేను సంతోషం పట్టలేక ఆయన దగ్గరకు వెళ్ళాను. వెళితే మీరు వ్రాసిన వ్యాసం బాగుంది. అప్పుడప్పుడూ వ్రాస్తుండండి అన్నారు. అప్పుడప్పుడూ వ్రాస్తుండేవాడిని. ఆ తరువాత ఆయన జైలుకు వెళ్ళడం జరిగింది. ఆయన ప్లేసులో కోట సుబ్బారావు గారు యాక్టింగ్ ఎడిటర్ అయ్యాడు. కోట సుబ్బారావు గారు నన్ను చాలా ప్రేమానురాగాలతో చూచిన వ్యక్తి ఆయన నన్ను వారానికి ఒక పేజీ వ్రాస్తుండమనే వాడు. అందుకు నెలకు రు. 5 లు ఇచ్చేవాడు. ఆ రోజులలో కృష్ణా పత్రికకు విశ్వనాథ సత్యనారాయణగారి తమ్ముడు వెంకటేశ్వర్లు గారు సబ్ ఎడిటర్‌గా ఉండేవారు. ఆయన వేసవికాలంలో 1923 సంవత్సరం అనుకుంటా నెలో రెండు నెలలో సెలవు పెడితే ఆయన ప్లేస్‌లో

నన్ను యాక్టింగ్ సబ్ ఎడిటర్‌గా వేసారు. ఆయన జీతం నెలకు రు. 80 లు. ఆ సెలవులో పనిచేసిన నెల, రెండు నెలలూ ఆ జీతం నాకు ముట్టింది.

ప్రశ్న : మీకు వ్రాయడానికి ఆ రోజుల్లో మెటీరియల్ ఎక్కడిది?

జ : ఆ పత్రికలూ, ఈ పత్రికలూ చూస్తుండేవాడిని. ఆ రోజుల్లో ఫారిన్ మెయిల్ కూడా ఫాలో కావాలన్నారు. మరి అది నాకు బందరులో ఎక్కడ దొరుకుతుంది? నాకు ఏమన్నా రిసోర్సెస్ ఉన్నాయా? అందువల్ల ఆ రోజుల్లో నేనొక తేలిక పద్ధతి కనిపెట్టాను. ఈ లండన్ జర్నల్స్ వీక్లీస్ డైలీస్ వగైరా లన్నీ కూడా ఆ రోజుల్లో బహుశ రెండు రెండున్నర నెలల తరువాత తుక్కు పేపర్ల క్రింద బందరు వరకూ వచ్చేవి. వేస్ట్ పేపర్‌గా వచ్చేవి కొన్ని. అవన్నీ పచారీ కొట్లో పడి ఉండేవి. నేను అక్కడికి వెళ్ళి డిఫరెంటు ఇస్యూస్ ఏరుకునే వాడిని. ఒక వీసె అణా, అణన్నరకు వచ్చేవి. దానిలో లండన్ వీక్లీస్ కొన్ని అబ్జర్వర్ .... ఇలాంటి కొన్ని పత్రికలు డెయిలీ టెలిగ్రాఫ్, డెయిలీ మెయిల్ దొరుకుతుండేవి. అది నా ఫారిన్ మెయిల్. అవన్నీ చదువుతుండేవాడిని. అలాంటి వాటిలో నాకు కొన్ని మంచి మంచి వ్యాసాలు దొరికేవి. నాకు ఒక విషయం జ్ఞాపకం వస్తోంది. ఒకప్పుడు ఇలాగే వీసెడో రెండు వీసెలో కొన్నాను. కొని కృష్ణారావు గారి దగ్గరకు వెళ్ళాను. ఆయనతో మాట్లాడిన తరువాత అవి ఆయన టేబిల్ పైన మర్చిపోయి నా దారిన నేనువెళ్ళి కొంతరం బస్సెక్కి వెళ్ళిపోయాను. బహుశ అది బుధవారమో గురువారమో అయ్యుండాలి. నెక్స్ట్ వారాంతంలో కృష్ణాపత్రిక చూస్తుంటే దానిలో నేను కొన్న రెండు పత్రికలలోని వ్యాసాలకు అనువాదం ప్రచురించినట్లు అనుమానంతోచింది. ఆ నా అనుమానం నిజమే. ఆ తరువాత కృష్ణాపత్రిక ఆఫీసుకు వెళ్ళినప్పుడు కృష్ణారావుగారు నవ్వుతూ నేను మర్చిపోయిన పేపర్లు నా చేతిలో పెడుతూ "నేను చిన్న పని చేసాను. మీరు ఇక్కడ మర్చిపోయి వెళ్ళిపోతే ఆ పత్రికల్లోనుంచి మంచి వ్యాసాలు తీసుకుని అనువాదంచేసి నా పేపర్లో వేసుకున్నాను" అని చెప్పారు. ఆ రెండు వ్యాసాలు ఇప్పుడు జ్ఞాపకం లేదు కానీ, ఒకటి మాత్రం జ్ఞాపకం ఉంది.

హిట్లర్ మిలిటరైజేషన్ యొక్క కాన్సిక్వెన్సెస్ దానిలో చర్చించడం అది ఉంది. "చాలా బాగా ఉందికదా అని దానిని వేసుకున్నాను" అన్నారు. ఈ

మాటలు ఎందుకు చెబుతున్నానంటే ఆ రోజుల్లో ఉన్నటువంటి కొద్ది రిసోర్సెస్ ఏ విధంగా వినియోగించుకున్నామో తెలియడానికి. లేకపోతే బందరులో ఫారిన్ మెయిల్ ఎక్కడ దొరుకుతుంది ? ఒకవేళ దొరికినా డబ్బు పెట్టి ఎక్కడ కొంటాము ? ఈ పద్ధతి తరువాత కూడా చాలా కాలం కంటిన్యూ చేసాను. బందరులో పచారి కొట్లలో కొన్నట్లు, అంతకంటే త్వరగా అంతకంటే ఎక్కువగా అంతకంటే ఎక్కువ పత్రికలు మద్రాసులో కూడా కొత్వాల్ చావిడిలో కొంటూ ఉండేవాడిని. అక్కడ పెద్ద మార్కెటు ఉండేది. రెండు, మూడు పీసెలు కొంటూ ఉండేవాడిని. రెండు మూడు నెలల తరువాత కాకుండా, లండన్‌లో విడుదల అయిన రెండు మూడు వారాలలోపునే దొరుకుతుండేవి. ఈ విధంగా కొన్న పత్రి ల్లోని వ్యాసాలు ఆ పత్రికకు ఈ పత్రికకు పంపిస్తుంటే డబ్బులు వస్తుండేవి. ఆ డబ్బుతో నాకు బందరులో బి.ఏ. చదవడానికి సాధ్యపడేది. పైగా ఆ రోజు ల్లో డాక్టర్లు, ఇంజనీర్లు చాలా తక్కువ. ఈనాడు ఆశ్చర్యంగా తోచవచ్చు. ఇద్దరు తమ్ముళ్ళు కాలేజీ చదువుకు వచ్చారు. ఒకతను నాతోబాటు బి.ఏ. దివే వాడు. ఇంకొకతను స్కూలు ఫైనలు చదివినట్లు జ్ఞాపకం. మేము ముగ్గ మూ చేరి మరొకనితో కలిసి రెండు గదులు అద్దెకు పుచ్చుకున్నాము. వరండా ాడా ఉండేది. ఈ మూడు గదులకు కలిసి ఆ రోజుల్లో రూ. 10 లు. అద్దె అని పకం. మరి జగన్నాథ హోటల్ ఉండేది. దానిలోనుంచి మేము కేరియర్‌లో జనం తెచ్చుకునే వారం. ఇంటికి తెచ్చుకుని తినేవాళ్ళం. ఆపదిరూపాయల జనం నెల పొడుగునా మా ముగ్గురికీ సరిపోయేది. ఇంకా ఎవరయినా ఎప్పుడ నా గెస్ట్ వస్తే కొంచెం సర్దుకుంటే చాలు వాళ్ళకు కూడా సరిపోయేది. అంత కగా ఉండేది. కొద్ది సంపాదనే అయినా నెలకు 15, 20 రూ. లు సంపాదించినా డా ఆ డబ్బుతో నేను కాలేజి చదువు సాగించగలిగాను. ఈ హోటల్ భోజనం ,, మా తమ్ముళ్ళతో షేర్ చేస్తుండే వాడిని. వాళ్ళ ఇద్దరికి కూడా పెదనాన్న ఏ డబ్బు పంపిస్తుండేవారు. వాళ్ల భాగం రెండువంతులు పెడితే నేను ఒక కు కంట్రిబ్యూట్ చేస్తుండే వాడిని. ఒక్కొక్కప్పుడు చదువుకు నేను ఇస్తుండే ని. ఆ విధంగా జరుగుతుండేది.

ప్ర : అప్పుడు కాలేజీలో మీ కొలీగ్స్ ఎవరున్నారు ?

జ : బందరులో చదివిన వాళ్లలో ఎక్కువగా ప్లీడర్లు అయినట్లున్నారు.

ఒకతను మాత్రం డిస్ట్రిక్ట్ జడ్జినో, సబ్ కోర్టు జడ్జివరకో వెళ్ళినాడు. కాకినాడలో ఉన్న క్లాస్‌మేట్స్ అప్పుడప్పుడూ వచ్చేవారు కానీ బందరులో వాళ్ళు వచ్చినట్లు అంతగా తోచదు, అందుచేత పెద్దగా చెప్పుకోతగిన వాళ్ళు లేరు. బందరులో నాకు చాలా హేపీగా గడిచింది. బందరులో తక్కిన స్టూడెంట్లకు నాకు వయసుభేదం చాలా ఉంది. నాకు మధ్యలో నాలుగయిదేళ్ళ గ్యాప్ రావడం వల్ల కొంచెం వయసు హెచ్చు. నాకు వేరే వ్యాపకాలు ఉంటేవి. టీచర్సుకూడా నన్ను స్టూడెంటుగా చూసేవారు కాదు. ప్రిన్సిపాలు జాన్‌స్టన్ గారు ఉండేవారు. ఆయన కూడా నన్ను చాలా బాగా చూసేవాడు. తరువాత అక్కడ ఉండగా నన్ను బి.ఎ. లో డిటెన్షన్ చేయడం జరిగింది, పరీక్షకు పంపకుండా. సెలెక్షను ఎగ్జామినేషన్ పెట్టినప్పుడు సెలెక్టు కాలేదు. ఆ పని ఈ పని చేస్తూ ఉండేవాడిని కదా, సరిగ్గా చదవడానికి అయ్యేది కాదు. అందువల్ల డిటెయిన్ చేసారు. ప్రిన్సిపాలుగారి దగ్గరికి వెళ్ళి, ఏమండీ నన్ను డిటెయిన్ చేసారు అని అడిగాను. తిన్నగా చదవలేదు. కాని ఇంకా టైము ఉంది కదా, పరీక్షకు పంపిస్తే పాస్ కాగలననే నాకు నమ్మకం ఉంది అన్నాను. వెంకటేశ్వరరావు అనే పేరుతో ముగ్గురో, నలుగురో ఉన్నారు. అందులో నీవు కూడా ఒకడివి అయ్యావు. ముందుగా తెలిస్తే డిటెయిన్ చేసే వాడిని కాదే. నేను దాదాపు ఇక్కడ 20, 25 సంవత్సరముల నుంచి ప్రిన్సిపాల్‌గా ఉన్నాను. ఒకసారి డిటెయిన్ చేసాను. లి కట్టిన తరువాత మళ్ళీ ఎవరినీ పరీక్షకు పంపలేదు. నామీద ఎన్ని ప్రెషర్సు వచ్చినా ఎవరినీ ఖాతరు చేయలేదు. ఒకటి రెండు సందర్భాలలో ఈ డిటెన్షను లిస్టు కట్టి ఆయన అప్పట్లో మన ఆంధ్ర యూనివర్సిటి బెజవాడలో వుండేది. ఆ ఆంధ్ర యూనివర్సిటీకి ఈయనను సి.ఆర్. రెడ్డిగారు ఆపరేటర్‌గా అపాయింటు చేశారు. ఆక్స్‌ఫర్డు పద్ధతి అనుకుంటా. ఈయన యూనివర్సిటీ మీటింగులకు వాటికి వెళ్ళు సందర్భాలలో బందరులో రైలు ఎక్కి బెజవాడ వెళుతుండే వాడు. ఈ విధంగా లిస్ట్ కట్టి నేను రైలు ఎక్కినప్పుడు రైలుక్రింద పడతామని కూడా కొంతమంది విద్యార్థులు థ్రెటన్ చేశారు. అయినా నేను ఖాతరు చేయలేదు. ఓన్లీ ఎక్సప్షన్ నీవు కాబోతున్నావు. అయితే నాకు చిక్కు రాకుండా ఒక పని చెయ్యి. అందరితోబాటు కాలేజీలో ఫీజు కట్టకుండా తరువాత అయిదు రోజులలోపల తాలూకా ఆఫీసులో ఫీజు కట్టి, అయిదు రూపాయలు పెనాల్టీ కట్టుకోవాలి. ఆ పెనాల్టీ సమేతంగా అక్కడ కట్టు అని ఆయన సలహా చెప్పారు. ఆయన చెప్పిన ప్రకారం అక్కడే కట్టాను. ఈ ఎగ్జామి

నేషన్సు ఫీజు అంటే నాకు మరొక విషయం జ్ఞాపకం వస్తున్నది. సరిగా ఎక్జామినేషను ఫీజు కట్టడానికి నా దగ్గర డబ్బులేక పోయింది. నా సంపాదనలో డబ్బు ఏమీ మిగిలి లేదు. అందువల్ల చిక్కు వస్తుందే అని ముందుగా మా పెద్దనాన్న (స్వంత పెదనాన్న కాదు) మా కుటుంబం అంటే వుండే ప్రేమకొద్ది, ఆదరం కొద్ది ఆయన ఆదుకున్నాడు. పైగా తను చిన్న జమీందారు. మా కుటుంబం చితికిపోయిన తరువాత ఆయన చాలా బాగుపడి జమీందారు స్టేటస్‌కు వచ్చాడు. పట్నం మునిసిపాలిటీకి వరుసగా తను వున్నంత వరకూ 30 ఏళ్ళు ఛైర్మన్‌గా చేసాడు. మరల 30, 35 ఏళ్ళు ఆనరరీ మేజిస్ట్రేటుగా చేసాడు. ఆయన పేరున కట్టించిన లైబ్రరీ పట్నంలో వెంకట్ లైబ్రరీ అని వుంది. ఆయన ఆనరరీ మేజిస్ట్రేటు పదవి వదలిపెట్టిన తరువాత కూడా మీరే తగవు చెప్పాలి అని కోర్టుకు వెళ్ళకుండా ఆయన దగ్గరకు వచ్చి కూర్చునే వారు జనం. తీర్పు చెప్పేవరకు వదలిపెట్టే వారు కాదు. చాలా పెద్దమనిషి అని, ధర్మరాజని పేరు పొందిన వ్యక్తి. పైగా ఎవరికయినా సహాయం చేయదలచుకుంటే ఒక్కసారి జనరస్ మూడ్‌లో 3, 4, 10 వేలు పారవేయడం అంత కష్టమయిన పనికాదు. కానీ ఓవర్ ఎ పీరియడ్ ఆఫ్ 10, 15 సంవత్సరములు ప్రతి నెలా 1వ తారీఖు వచ్చేసరికి జ్ఞాపకం వుంచుకుని 10, 15, 20 రూపాయలు మనియార్డరు చేయడం మాత్రం అది చాలా గొప్ప విషయం. ఆ పని ఆయన చేస్తూ వచ్చాడు. అందువల్ల నేను ఉత్తరం వ్రాసాను. మీ సహాయంతో చదువు ప్రారంభించాను. దానితోనే మళ్ళీ పూర్తి చేయాలని కుతూహలపడుతున్నాను. అందుచేత ఎక్జామినేషను ఫీజు ఇంత అవుతుంది, పంపించగలరా అని వ్రాసాను. ఆయన వెంటనే పంపిస్తూ (నాకు సహాయం చేయాలనే ఆయనకు వున్న ఆతృత అలాంటిది) ఆ మనియార్డరు కూపన్ మీదనే నీవు బి.ఏ. పరీక్షకు కూర్చోబోతున్నావు అని వినడానికి సంతోషిస్తున్నాను. మరి ఈ డబ్బు నీకు సకాలంలో అందుతుంది అనుకుంటున్నాను. ఒకవేళ అందకపోతే నాకు టెలిగ్రాము ఇవ్వవలసిందని మనియార్డరు కూపన్ లోనే వ్రాసారు. మనియార్డరు అందితేనే తెలిసే విషయమది. ఆయన ఆతృత అలాంటిది. చాలాకాలం ఆ మనియార్డరు కూపన్ పదిలంగా దాచుకున్నాను. తరువాత ఎక్కడో జారి పోయింది. నాకు సెంటిమెంటల్ వాల్యూ వున్నటువంటి మనియార్డరు కూపన్ అది. ఆయన పంపిన డబ్బుకట్టి పరీక్షకు కూర్చుని మూడవ శ్రేణిలో పాస్ అయ్యాను. ఇది 1934 లో పాస్ అయ్యాను. హిస్టరీ,

ఎకనామిక్స్ గ్రూప్‌లో. అప్పుడు కాలేజీ ప్యూన్ దగ్గరనుంచి ప్రిన్సిపాల్ వరకూ నాకు ఏదో యూనివర్సిటీ ఫస్ట్ వచ్చినంత సంతోషించారు. వారు కూడా (ఎవరూ) నేను పాస్ అవుతానని అనుకున్నవాళ్ళు కాదు. నేను ఫస్ట్ క్లైమే పాస్ అవడం గొప్ప విశేషం అనిపించింది.

ప్ర : బందరులో వుండగా విద్యార్థుల మీద రాజకీయ ప్రభావం ఎలా ఉండేది ?

జ : విద్యార్థులలో అప్పటికే కొంత వుంది. భగత్‌సింగు వగైరాల ఘట్టం అయ్యింది. తరువాత ఉప్పు సత్యాగ్రహం జరిగి ఆగిపోయింది.

ప్ర : ఏ నాయకుల ప్రభావం ఎక్కువ వుండేది ?

జ : కొంతవరకూ నెహ్రూ ప్రభావం వుండేది. అంతకంటే నాకు, నేను తిరుగుతున్న వర్గాలలో విప్లవవీరుల ప్రభావం ఎక్కువ వుండేది. నేను కూడా అటువైపే కొంత మొగ్గు చూపుతూ వచ్చాను. నేను కూడా ఆ రోజుల్లో తీవ్రవాదినే. అందువల్ల ఈ మధ్య కాలంలో కొంత కాలం టెర్రరిస్టు గ్రూపుతో కలిసి పనిచేసిన వాడినే. అంటే 1930-34 సంవత్సరముల మధ్య. అందువల్ల ఆ రోజులలో నన్ను షాడో చేయమని నామీద ఒక C.I D. కేసు పడవేశారు. దాదాపు 1937 వరకూ కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడేంతవరకూ ఎప్పుడూ నాకు ఎస్కార్టుగా ఒక పోలీసు కానిస్టేబులు వుండేవాడు.

ప్ర : మీరు కూడా అప్పుడు జరిగిన విద్యార్థుల వుద్యమాల్లో పాల్గొన్నారా ? సమ్మెలూ,? స్ట్రయికులూ ?

జ : బందరులో వుండగా ఈ టెర్రరిస్టు గ్రూపుతో సంబంధం వుండేది. అంతే తప్ప డైరెక్టుగా ఈ వుద్యమాల్లో పాల్గొన్నది తక్కువ. అయితే 1932-33 మధ్య కొంతవరకూ రాజకీయాల్లో తిరిగిన దాఖలా వుంది. ఉప్పు సత్యాగ్రహం జరిగిన రోజుల్లో పాల్గొన్నానని ఇంతకు ముందు చెప్పాను. (ఆ రోజు మీరు అడిగారు, మాన్యుస్క్రిప్ట్‌తో నడిపిన పత్రిక పేరు. ఆ రోజు జ్ఞాపకం రాలేదు. కాకినాడలో మేము నడిపిన పత్రిక యువజన పత్రిక. దానిని నేను

తిమ్మరాజు సత్యనారాయణరావు నడిపాము. తరువాత 1930-31లో కొతరంలో వుంతగా మిడిల్‌స్కూల్లో ఒక సైక్లోస్టైల్ మిషన్ వుండేది. అది వుపయోగించి ఆ రోజుల్లో మేము 'మాతృభూమి' అని మరో పత్రిక ఒకటి నడిపాము. అది మూడు, నాలుగు ఇస్యూస్ వేసాము.

ప్ర : సాహిత్యానికి సంబంధించినదా, లేక అన్ని విషయాలకు సంబంధించినదా ?

జ: అన్ని రకాలు కూడా వుండేవి. రెండు, మూడు ఇస్యూలు వేసాము. మేమే స్వయంగా వ్యాసాలు వ్రాయడం. స్వయంగా మేమే సైక్లోస్టైయిల్ చేయడం, కాపీలు బైండ్ చేయడం, మేమే పోస్టు చేయడం చేసాము.

ప్ర : అప్పుడు ప్రభుత్వ నిబంధనలు ఏమీ లేవా ?

జ : అప్పుడు ప్రభుత్వ నిబంధనలు లేవు. ఎందుకంటే ఎక్కువ కాపీలు సర్క్యులేట్ అయ్యేవి కావు. తరువాత ఈ మధ్యకాలంలో ప్రభుత్వ సెన్సార్ షిప్ ఎక్కువ వున్న రోజులలో అప్పుడు 'స్వతంత్ర భారత్' అనిచెప్పి ఒక అండర్‌గ్రౌండు మాగజైన్ రన్ అవుతుండేది. దానికి నన్ను వ్యాసాలు వ్రాయమనే వారు. నేను వ్రాస్తుండేవాడిని. ఆ రోజులలో నేను బందరులో వుండడానికి, బైటిపని చేయడానికి ఇద్దరు స్నేహితులన్నారు. ఫైనాన్స్ కూడా పెట్టుకుంటూ వుండేవారు. హోటల్ ఖర్చులు పెట్టుకునేవారు. అప్పుడు వ్రాయడమే కాదు, సైక్లోస్టైల్ చేయడం, కాపీలు డిస్ట్రిబ్యూట్ చేయడం కూడా నా బాధ్యతగా వుండేది. సక్సెస్‌ఫుల్‌గానే చేసే వాడిని. ఎందువల్లనంటే నేను మాగజైన్ కాపీస్‌ని పెద్ద సంచిలో పెట్టుకుని కావాలనే పోలీస్ స్టేషను ఎదురుగా నడిచేవాడిని. సందుల్లో, గొందుల్లో గుండా నడిస్తే అనుమాన పడవచ్చుని బాహాటంగా పోలీసు స్టేషను ముందుగుండానే నడిస్తే ఎవరూ అనుమానించరనే సిద్ధాంతంమీద ఆధారపడి చేసిన పని. ఆ విధంగా చాలా సార్లు తీసుకుపోయినా ఎవరూ అనుమానించ లేదు. పట్టుకోలేదు. అందువల్ల నా సిద్ధాంతాల మీద కొంత నిజం ఉన్నట్లు తోస్తోంది.

ప్ర : 'స్వతంత్ర భారత్' కమ్యూనిస్ట్ ...

జ : పేరు పెట్టి నడిపాము. అందువల్ల పేరు కూడా ఉండేదేమో నాకు తెలియదు.

ప్ర : కమ్యూనిస్టు పార్టీ పత్రికల్లో ఈ పేరు చెప్పుకుంటారు. వాళ్ళ పత్రికే ఇది అంటారా ?

జ : ఏమో నాకు తెలియదు. కాని ఒక చిన్న అండర్‌గ్రౌండు పేపరు ఇది. ఈ పేరుతో రన్ చేస్తుండేవారు. అది స్టార్ట్ చేసింది నేను కాదు. ఒక పట్టంలో నన్ను వ్రాసి నడపవలసిందని చెప్పి వల్లూరు రామారావుగారు అని ఒక ఫ్రెండు, మరో ఫ్రెండు ఆహ్వానించారు. ఈ పనిచేస్తూ పోయినందుకు బందరులో వుండడం కోసం నాకు 15 రూపాయలు హోటల్ ఖర్చులకు ఇస్తూ పోయే వారు.

ప్ర : అంటే అప్పటికే మీమీద కమ్యూనిస్టు ప్రభావం ఏమయినా ఉండేదా?

జ : అప్పటికి కూడా లేదు. నేను బి. ఎ. పాస్ అయ్యాక ఎం. ఎ. చదవాలనీ చాలా కుతూహలంగా ఉండేది. అది కూడా బెనారస్ వెళ్ళి చదవాలని కూడా ఉండేది.

ప్ర : ఎందుకు బెనారస్ వెళ్ళి చదవాలని కుతూహల పడ్డారు?

జ : ఎందుకంటే 1932 లో ఒకసారి అక్కడికి కొంతమంది ఫ్రెండ్సు తోటే వెళ్ళాను. అక్కడి వాతావరణం నాకు బాగా నచ్చింది. యూనివర్సిటీ వాతావరణం, లైబ్రరీ వగైరాలన్నీ బాగా నచ్చాయి. అందువల్ల బెనారస్ వెళ్ళి చదవాలని కుతూహలం పుట్టింది. మరి ఈ మధ్య కాలంలో బి.ఎ. చదువుతున్న రోజులలోనో మొట్టమొదటి తెలుగు పుస్తకం వ్రాసాను. ఆ పుస్తకం అచ్చు వేయించడం కోసం డబ్బు లేకపోయింది. వ్రాయడం అయితే వ్రాసాను. బయట వెయ్యాలని కూడా నాకు తోచలేదు. స్వయంగా అచ్చువేయించాలని అనుకుంటే నా దగ్గర డబ్బు లేదు. అందుచేత కొంతమంది స్నేహితులను మీరు అందరూ తలో 10/- రూ. చొప్పున నాకు అడ్వాన్సు చేయకూడదా, ఈ పుస్తకం అచ్చు వేయిసాను అని అడిగితే 10 మంది స్నేహితులు ముందుకు వచ్చి తలో రూ. 10

ఇచ్చారు. ఇస్తే నేను ఆ రోజులలో నూరు పేజీల పుస్తకం అచ్చువేయించడానికి కాగితం, ప్రింటింగ్ బైండింగు సమస్తము 100 రు. అయిపోయింది. ఆ రోజులలో 100, 105 పేజీల పుస్తకం వేయించడానికి కేవలం 100 రు. ఖర్చు అయ్యేది. 100 రు. కేవలం ప్రింటింగు ఖర్చులే కాదు. నేను బెజవాడ వెళ్ళి అక్కడ కొన్ని రోజులు వుండి ప్రూఫులు దిద్దుకుంటూ హోటలు ఖర్చులు పెట్టుకుంటూ వుండడానికి 100 రు. అయింది. అంత చౌకగా అయిపోయింది. తరువాత నేను నా ఫ్రెండ్సు ఒక్కొక్కరికి పుస్తకం అర్ధ రూపాయి ధర చొప్పున 20 కాపీలు, 30 కాపీల చొప్పున ఇచ్చి, మీరే కాస్త వీటిని అమ్ముకోండి, మీ డబ్బులు మీకు వస్తాయి అని చెప్పాను. వారు వేరే ఏమీ అనుకోలేదు. వాళ్లు అమ్ముకున్నారు. వారి డబ్బు వారికి వచ్చింది. నాకుకూడా కాపీలు బాగానే అయిపోయాయి. ఆరు నెలల్లో అన్నీ అయిపోయాయి. అంత త్వరగా అమ్ముడు పోవడానికి ఒక కారణం ఏమిటంటే-ముట్నూరు కృష్ణారావుగారికి ఒక కాపీ తీసుకు వెళ్ళి ఇచ్చాను. ఇది నా మొదటి పుస్తకం. కాస్త దయచేసి చూడండి అని ఇచ్చాను. ఆయన ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ తీసుకున్నారు. తరువాత దానిని చదువుతారో లేదో కూడా నాకు గట్టి నమ్మకం లేదు. ఇవ్వడం అయితే ఇచ్చాను. పని అయిపోయింది. కానీ చాలా ఆశ్చర్యం కలిగింది. ఆ వారమే ఆయన తన మెయిన్‌లీడర్ ఒకటి రెవ్యూగా వ్రాసారు నా పుస్తకం గురించి. అందువల్ల ఆయన అంతగా శ్రద్ధ పుచ్చుకుని ఒక లీడర్ వ్రాసేసరికి మంచి ప్రచారంలోకి వచ్చింది. 10 మందికి తెలియడం, త్వరగా అమ్ముడు పోవడం జరిగింది. ఆ రోజులలో ఈ పుస్తకాలు అమ్మితే ఖర్చులు పోనూ 100, 150 మిగిలింది.

ప్ర : దానికి మెటీరియల్ ఎక్కడ సేకరించారు?

జ : చాలా మంది అనుకున్నారు. నేను **H. H.** గౌబా అని అతను వ్రాసిన పుస్తకాన్ని అనుసరించానేమో అనుకున్నారు. కానీ నేను నా పుస్తకం పబ్లిష్ చేసిన తరువాత కానీ ఆ పుస్తకం చూడలేదు. మద్రాసులో మూర్ మార్కెట్‌లో 'ఒకచోట ఇండియన్ ప్రిన్సెస్ అండర్ బ్రిటిష్ ప్రొటెక్షన్' భగ్గన్ అనే అతడి రచన ఒకటి చూచాను. అంతకుముందు అప్పుడప్పుడూ స్వదేశీ సంస్థానాల గురించి పత్రికల్లో వ్రాసిన వ్యాసాలు కటింగులు నా దగ్గర ఉండేవి.

అందుచేత ఈ పుస్తకం కనపడినప్పుడు కొందామనుకున్నాను. డబ్బులు లేవు. అప్పుడు నావెంట మూర్‌మార్కెటుకు వాద్రేవు జగ్గరాజు తూర్పుగోదావరి జిల్లా కాంగ్రెసువారు ఉన్నారు. ఆయనతో అన్నాను. ఈ పుస్తకం కొందామని ఉంది. మరి నా దగ్గర డబ్బు లేదు. నాకు అది కొనాలి. చాలా ఇంటరెస్టింగ్ ఉంది. మరి మీరేమయినా కొనిస్తారా అని అడిగాను. దాందేముంది, బేరం ఆడండి అన్నారు. దాని ఖరీదు ఒక్క రూపాయి మాత్రమే. ఆ రోజుల్లో ఆ రూపాయికూడా నాదగ్గర లేదు. ఇంకొక మాట కూడా ఉంది. ఆ రోజుల్లో బస్తా వడ్లు రు. 3/- కూడా లేదు. అది కూడా అంత తక్కువ మొత్తం కాదు. ఆ రోజుల్లో అది ఆయన కొనిచ్చారు. ఆ పుస్తకం, నా దగ్గర ఉన్న కటింగ్స్ ఆధారం చేసుకుని వ్రాసాను. అంతే కానీ హెచ్. హెచ్. గౌబా పుస్తకం చూడలేదు. నా పుస్తకం కంటే కొద్దిగా ముందు, అంటే రెండు మూడు వారాల ముందే వెలువడింది గౌబా పుస్తకం. అందువల్ల దీని మీద బాగా డబ్బు వచ్చింది. కనుక అప్పుడు నేనేమను కున్నానంటే మళ్ళీ ఒక పుస్తకం వ్రాద్దాము, దాని మీద మళ్ళీ ఏ రెండు మూడు వందలో వస్తే ఎం.ఏ. చదువుదామని ప్లాన్ వేసాను. బందరులో ఒక ఫ్రెండు దగ్గర రష్యా గురించి పుస్తకాలు ఉండేవి. అందులో అది ప్రొహిబిటెడ్ కూడాను ఆ ఫ్రెండు పేరు సుబ్బారావు. ఇంటిపేరు బాగా జ్ఞాపకం లేదు. ఇప్పుడు ఆయన లేడు. చనిపోయాడు. అతడి దగ్గర ఈ పుస్తకాలు బారో చేసి హిండర్స్ బుక్స్ అవీ తీసుకుని ఈ పుస్తకాలు చదివి-అప్పుడు నేను రష్యా వెళ్ళినవాడిని కాదు, చూచిన వాడిని కాదు-అవన్నీ చదివి 'నేటిరష్యా' అనే పుస్తకం వ్రాసాను. మళ్ళీ ఈసారి కూడా అచ్చువేయించడానికి డబ్బు లేదు. మళ్ళీ తిరిగి ఫ్రెండ్సుని మీరే డబ్బు ఇవ్వండి అని అడుగుదాము అనుకుంటూ ఉండగా నా మొదటి పుస్తకం పొందిన విజయాన్ని మా అమ్మ చూచి ఉంది కనుక, సరే అబ్బాయీ నీవు పుస్తకం అచ్చువేయించు, కావాలంటే మీ చెల్లెలు గాజులు ఉన్నవి. అవి అమ్మేయి. అమ్మితే 100, 110 రూ.లు వస్తాయి. పుస్తకాలు అమ్మగా వచ్చిన లాభంపెట్టి మళ్ళీ గాజులు చేయించుదువు అంది. సరే అని గాజులు తీసుకు వెళ్ళి బెజవాడ షాపులో అమ్మి అచ్చువేయించాను. అచ్చువేయించిన తరువాత రెండు, మూడు వారాలు కాలేదు, ఆ పుస్తకం ప్రొహిబిట్ చేసాము అన్నారు. గవర్న మెంటువారు బహిష్కరించారు. వాటిని అమ్మిపెట్టండి అని చెప్పి ఆ పుస్తకాన్ని బహిష్కరిస్తారేమోననే అనుమానం లేకపోలేదు. అందువల్ల వాటిని అమ్మిపెట్టండి

అని చాలా భాగం పుస్తకాలు అక్కడికక్కడే ఫ్రెండ్సుకి ఇచ్చివేసాను. అవి వాళ్ల అమ్మారో లేదో తెలియదు కానీ నాకు దాదాపు ఒక్క దమ్మిడీ కూడా చేతికి రాలేదు. ఏమయ్యిందంటే కొంతమంది అన్నారు బహిష్కరించారు కదాని. భయ పడి వాటిని డిస్ట్రాయ్ చేసాము అన్నారు. అందువల్ల లాభం రాలేదు సరికదా మా చెల్లెలు గాజులు పోగొట్టుకోవడం మాత్రం జరిగింది. దాంతో బెనారస్ వెళ్ళి ఎం.ఏ. చదివే ఆలోచన కూడా విరమించవలసి వచ్చింది.

ప్ర : తరువాత ఏం చేసారు? ఆ కాపీలన్నీ అలాగే ఉండిపోయాయా?

జ : కాపీలు ఎక్కడంటే అక్కడ పోలేదుకానీ అండర్ గ్రౌండులో సర్క్యులేట్ అయ్యాయి.

ప్ర : బ్యాన్ లిఫ్ట్ చేయలేదా?

జ : బ్యాన్ లిఫ్ట్ చేయడం కానీ, ఇంటికి వచ్చి వెతకడం కానీ చేయలేదు వాళ్లు వచ్చి వెతికినా దొరికేవి కావు. అప్పటికే నా దగ్గర ఏమీ లేవు.

ప్ర : ఇది ఏ సంవత్సరంలో జరిగింది ?

జ : 1934 ఎర్లీలో జరిగింది.

ప్ర : 1934 ఆగస్టు కృష్ణాపత్రికలో మీ సంపాదకీయం ఉంది. కాబట్టి ఆగస్టుకు ముందే ఇది జరిగి ఉంటుంది.

జ : అంతే అయి ఉండాలి, నాకు బాగా జ్ఞాపకం లేదు. ఎందువల్లనంటే మొదటిది గుర్తున్నంతగా రెండవది లేదు. మీరు ఇప్పుడు చెప్తుంటే వ్రాసాను కాబోలని గుర్తువస్తున్నది. తరువాత ఆ పుస్తకం చదివి చాలా మంది ఇన్ఫ్లు యన్స్ అయ్యారని చెప్పిన వారిలో అల్లూరి సత్యనారాయణరాజుగారు ఒకరు. ఆయన చాలా కాలం అంటుండేవారు. సోషలిస్టువైపుకు మారింది ఈ పుస్తకం చదివి అని అన్నారు. అయితే ఈ పుస్తకం వ్రాయడానికి ముందు భారతికి కూడా ఆరు వ్యాసాలు వ్రాసాను. అయితే వ్యాసాలు వ్రాసిన ధోరణి లేదు...ఈ

పుస్తకం వ్రాసే వేళకు మార్క్స్ పుస్తకాలు చదివాను. ఈ ధోరణి నాక నచ్చింది. ఆ ధోరణిలో పుస్తకం వ్రాసాను. వేరే ధోరణిలో వ్యాసాలు వ్రాసాను ఆరు వ్యాసాలకు ఆరు 25లు ఇవ్వలేదు. 100 రూపాయలు ఇచ్చారు. ఆ రోజులలో రు. 100 కూడా పెద్ద మొత్తమే. అవి వరుసగా భారతిలో వచ్చాయి. తెలుగులో వ్యాసాలు వ్రాస్తున్నా, పుస్తకాలు వ్రాస్తున్నా ఆ విధంగా కొద్దిగా డబ్బులు సంపాదించినా, నాకు తెలుగు జర్నలిజంలో చేరాలని ఉండేది కాదు. ఇంగ్లీషు జర్నలిజంలో చేరాలని ఉండేది. ఆ రోజులలో ఇంగ్లీషులో కూడా వ్యాసాలు వ్రాసేవాడిని. అయితే వాటికి డబ్బు వచ్చేది కాదు. అయినా వ్రాస్తుండే వాడిని. నేను మొట్టమొదట ఇంగ్లీషులో పట్టాభిసీతారామయ్యగారి జన్మభూమి పత్రికకు వ్రాసాను. అది ఆ రోజులలో బందరులో ప్రచురించేవారు కాదు ఎన్. గణేశన్ అండ్ కంపెనీ వాళ్లు పబ్లిషర్స్‌గా తీసుకున్నారు జన్మభూమిని. ఎడిటోరియల్ ఆఫీసుమాత్రం పట్టాభిసీతారామయ్యగారి ఇంటిలోనే. ఇల్లు, ఆఫీసు రెండూ ఒకటిగా ఉండేవి. అప్పుడు వల్లూరి రామారావుగారనీ ఒక ఫ్రెండు ఇంటిలో గెస్టుగా ఉండే వాడిని. వారు స్వరాజ్య పత్రికకు మచిలీపట్నం రిపోర్టరు. ఇన్స్యూరెన్సు ఏజెంటు కూడా. బందరులో ఉంటే ముఖ్యమైన మీటింగులకు వగైరాలకు నన్నే పంపించే వాడు. ఆయన పేరుతో నేనే రిపోర్టులు వ్రాసి స్వరాజ్య పత్రికకు పోస్టు చేస్తుండే వాడిని. అప్పుడు ఒక సందర్భంలో ఏమయ్యిందంటే జన్మభూమికి ఒక వ్యాసం వ్రాయాలని కుతూహలపడి నోట్సులాంటిది వ్రాసాను. వాటికి షుగర్ అండ్ స్పైస్ అని హెడ్డింగు పెట్టి, మరి పట్టాభిగారికి అందచేద్దాము అంటే బిడియం అంతవరకూ ఆయనను కలుసుకోలేదు. మాట్లాడలేదు. డైరక్టుగా ఇంగ్లీషులో మొట్టమొదటగా వ్రాయడం. ఆయన ఏ విధంగా రియాక్ట్ అవుతాడో తెలియదు. అందువల్ల తీసుకు వెళ్ళి ఫర్ ఫేవర్ ఆఫ్ పబ్లికేషన్ అని వ్రాసి దూరాన పోస్టాఫీసుకి వెళ్ళి పోస్టు చేశాను. అడ్రసు ఇచ్చిందేమో కేరాఫ్ వల్లూరి రామారావు అనే. ఈ వల్లూరి రామారావు అద్దెకున్న ఇల్లు పట్టాభిగారి ఇల్లు సరిహద్దు గోడే అడ్డం. అందువల్ల మరునాడు పట్టాభిగారు ఆయనదగ్గరికి వెళ్ళినపుడు ఎవరో నార్ల అట. ఆయనకు డబ్బులేమన్నా జాస్తిగా ఉన్నవా, ఇంటి ప్రక్కన ఉంటూ వ్యాసం నా చేతికి ఇవ్వవచ్చుకదా! అంత దూరంవెళ్ళి పోస్టులో వేశాడు అన్నారట. అంతేకాదు, వ్యాసం బాగానే వుంది కాని అక్కడక్కడా స్పెల్లింగు మిస్టేకులు ఉన్నాయి. ం ఇద్దించికొంచెపట్టుకురా అన్నారట. తరువాత వలూరి

రామారావు నాతో చెప్పకుండా ఎందుకు పంపించావు అని, ఆ తప్పులు దిద్దివ్వవల సింది అన్నాడు. తప్పులని తెలిస్తే ఎందుకు వ్రాసేవాడిని. నీవే దిద్దు అంటే దానిని దిద్దిన తరువాత అది వెళ్ళింది. ఆ తరువాత పబ్లిష్ అయ్యింది. అయితే హెడ్డింగు మార్చివేశారు. షుగర్ అండ్ స్పైస్‌కు బదులు gentleman అని వ్రాసారు. ఆ విధంగా మూడు నాలుగు వారాలు వరుసగా వ్రాసాను. ఒక ఫీచర్‌గా అవి కంటిన్యూ అయ్యేదేమో. కాని జన్మభూమిని బ్యాన్ చేశారు.

ప్ర : కరెంటు ఈవెంట్స్ మీద వ్రాసారా?

జః కామన్‌గా అన్నీ వ్రాసేవాడిని. ఇది జరిగింది 1931 ఆప్రాంతంలో ఈ జన్మభూమి పత్రిక ఆపేయడం చూచి దానిలో వచ్చినటువంటి ఎంకరేజ్. మెంటు పురస్కరించుకుని లాహోరులో 'ది పీపుల్స్' అని ఒక వీక్లి ఉండేది. దానిని నడిపించినాయన లజపతిరాయ్ చనిపోయాడు. సరోప్‌చంద్ నడిపిస్తుండే వాడు. దానికి వ్యాసాలు వ్రాయడంతో వాళ్ళు వరుసగా వేస్తూ వచ్చారు. ఒక సందర్భంలో మా తమ్ముడు ఒకతను, వేస్తున్నారు బాగానే ఉంది. కానీ నీవు వ్రాసిన వ్యాసం ఒక్క రోజు కూడా ఫ్రంటు పేజీలో ఎనౌన్సు చేయడం లేదు అని నన్ను కామెంటు చేసాడు. ఆ రోజు కూడా త్వరలో వస్తుందిలే అన్నాను. అలాగ అన్న రెండు మూడు వారాలకే ఫ్రంటు పేజీలో ప్రామినెంటుగా ఎనౌన్సు చేసారు. ఫలానా వ్యాసం బై సో అండ్ సో అనే ధోరణిలో వ్రాసారు. అది కొంత ప్రోత్సాహంగా ఉండేది. లాలాలజపతిరాయ్ పత్రికకు వ్రాసాను. తిలక్ పత్రికకు ఎందుకు వ్రాయకూడదూ అని ఒక వ్యాసం 'మరాటా' పత్రికకు వ్రాసి పూనా పంపాను. వాళ్ళు వేసారు. ఇవన్నీ గుర్తులో పెట్టుకుని ఎలాగయినా ఇంగ్లీషు జర్నలిజంలో చేరాలని చాలా కుతూహలంగా ఉండేది. ఆ తరువాత 1934లో ఒకసారి బి.ఏ. పాస్ అయ్యాక బెనారస్ ప్లాన్సు అన్నీ అయిపోయాక పట్టాభిసీతా రామయ్య గారి దగ్గరకు వెళ్ళి నాకు ఢిల్లీ వెళ్ళాలని ఉంది అన్నాను. అప్పుడు హిందూస్థాన్ టైమ్సు చాలా పేరులో ఉంది. పోతన్ జోసఫ్ పేరులో ఉన్నాడు ఆ పేపరులో చేరాలని అందులో ఏ ఉద్యోగం దొరకకపోయినా అన్ పెయిడ్ అప్రెంటిస్‌గా చేరి పని నేర్చుకోవాలని కుతూహల పడ్డాను. వెళ్ళడానికి డబ్బులు లేవు. ఉండడానికి అంతకంటే లేదు. అయినా ఉత్సాహం అలాంటిది. పట్టాభి సీతా రామయ్యగారు జోసఫ్ గారికి ఒక లెటరు వ్రాసిఇస్తారా అని అడిగాను. అంటే అయ

నతో నాకు పరిచయం లేదే, నాకు తెలియదే, ఒక అపరిచితుడికి ఏ విధంగా ఉత్తరం వ్రాస్తాను అన్నాడు. సరేలెండి మీరేం చేస్తారని నేను వచ్చేస్తుంటే కాదులే రా రా అని చెప్పి నేను ఒక యంగ్‌మాన్‌ని పరిచయం చేస్తున్నాను అంటూ వ్రాసి తనను తాను పరిచయం చేసుకుంటూ ఒక మంచి లెటరు వ్రాసి ఇచ్చారు. ఆ ఉత్తరం జేబులో పెట్టుకుని తిరిగాను. అక్కడికి వెళ్ళడానికి సాధ్యపడలేదు. తరువాత మద్రాసు వెళ్ళాను 1935లో ఉద్యోగ అన్వేషణకు. మద్రాసు వెళ్ళడానికి కూడా డబ్బులు లేవు. ఇద్దరి ఫ్రెండ్సు దగ్గర అప్పుచేయవలసివచ్చింది. అలా ఇచ్చిన వారిలో నర్సయ్య చౌదరి గారు రు. 10 లు ఇచ్చారు. ఆయనకూడా పెద్ద ఉన్నవాడు కాదు. మద్రాసు వెళ్ళాలని ఉంది. మీరు సహాయం చేస్తారా అని అంటే ముందు మీరు మా ఇంటికి భోజనానికి రండి అని తీసుకు వెళ్ళి భోజనం అయిన తరువాత మాట్లాడకుండా ఒక కవరు నా చేతిలో పెట్టాడు. అందులో నేను అడిగిన రు. 10 లు ఉన్నాయి. అదే విధంగా అడవి బాపిరాజుగారిని కూడా అడిగాను, ఒక రు. 10 లు మీరు ఇస్తారా అని. ఆయన కూడా డబ్బు ఉన్నవాడు కాదు. నా అనుమానం ఏమిటంటే ఆయన కూడా కాటూరి వెంకటేశ్వరరావుగారి దగ్గర ఆ రు. 10 లు అప్పుచేసి నాకు ఇచ్చాడని. ఆ రోజుల్లో ఆ ఇద్దరూ చెరో రు. 10 లు ఇవ్వడం చాలా గొప్ప సహాయం. ఇప్పటికీ నేను వాళ్ళు చేసిన సహాయం మర్చిపోలేను. నర్సయ్య చౌదరి గారు ఈ ఊరిలోనే ప్రాక్టీసు చేసారు ఈ మధ్యనే నా దగ్గరికి వచ్చి వెళ్ళారు కూడా. ఆ డబ్బులతో ముందుగా నేను బందరులో చేసిన అప్పులు కొంత తీర్చుకోవలసివచ్చింది. అవి తీర్చుకుని టికెట్ కొనుక్కొని మద్రాసు చేరేసరికి చేతిలో ఒక రూపాయి పన్నెండు అణాలు మిగిలాయి. అంతకు ముందు నాకు బందరులో పరిచయం అయినదీ, మద్రాసు వెళ్ళినప్పుడు పరిచయం అయిన ఎస్. జి. ఆచార్య జర్నలిస్టుతో, ఆయన ప్రోత్సాహం మీదనే నేను అక్కడికి వెళ్ళాను. వెళితే ఆయన చాలా ఆదరించాడు. వాళ్ళింటిలోనే నెల రోజులు పెట్టుకున్నాడు. చాలా సహాయం చేసాడు.

అనుబంధం - 4

# వి. ఆర్. నార్ల జీవితక్రమం

| | |
|---|---|
| పుట్టుక | డిసెంబరు 1, 1908, జబల్‌పూర్ (మధ్యప్రదేశ్) |
| కవుతరానికి తరలిరాక | 1914-15 |
| ప్రాథమిక విద్య | 1916-20 |
| సెకండరీ విద్య, గుడివాడ | 1920 |
| సోదర సమితి స్థాపన | 1923 |
| ఇంటర్మీడియట్, కాకినాడ | 1925 |
| కాంగ్రెసు మహాసభ సందర్శనం, మద్రాసు | 1928 |
| "కాంగ్రెసు" పత్రికకు రచనలు | 1929-30 |
| టెర్రరిస్టు కార్యకలాపాలు, జైలు | 1929-30 |
| భారతి, కృష్ణాపత్రికలలో రచనలు | 1931-34 |
| బి.ఏ. బందరు | 1934 |
| 'స్వదేశీ సంస్థానాలు' రచన | 1934 |
| 'నేటి రష్యా' (బాన్ చేయబడింది) | 1934 |
| ప్రభ, జ్యోతి పత్రికలు బందరులో నిర్వహణ | 1935 |
| మద్రాసు చేరడం | జులై 1935 |
| ప్రజాబంధు, వినోదిని, సమదర్శినిలో రచనలు | 1935-38 |
| జనవాణిలో రచనలు | 1936 |
| పత్రిక ప్రజామిత్ర | 1937 |
| "స్వరాజ్య"లో పని | 1937 |
| ఆంధ్రప్రభలో చేరిక | 1938 |
| వివాహం, సులోచనగారితో మద్రాసులో | 1938 |

| | |
|---|---|
| ంధ్రప్రభ ఎడిటర్ | 1942 |
| ర్నలిస్టు సంఘ అధ్యక్షుడు | 1946 |
| కొత్తగడ్డ" ప్రచురణ | 1948 |
| ామా రివైవల్ కమిటీ, మద్రాసు ప్రభుత్వ సభ్యుడు | 1950-51 |
| ాటామంతి, పిచ్చాపాటి | 1952 |
| ్రథమ విదేశీ పర్యటన | 1954 |
| క్ట్స్ బుక్ పాలిసీ కమిటీ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సభ్యుడు | 1955 |
| నరల్ కౌన్సిల్ ఆఫ్ తెలుగు అడ్వైజరీ బోర్డు, | |
| ాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ, సభ్యుడు | 1957 నుండి |
| నరల్ కౌన్సిల్, ఎక్సిక్యూటివ్ కమిటీ అండ్ ఫైనాన్స్ కమిటీ, | |
| ంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యుడు | 1957 నుండి |
| జ్యసభకు ఎన్నిక | 1958 |
| ునెస్కో ప్రతినిధివర్గంలో విదేశాలు | 1958 |
| ంధ్రప్రదేశ్ సమాచారశాఖ పునర్వ్యవస్థీకరణ సంఘం అధ్యక్షుడు | 1958-59 |
| ంద్ర పురావస్తు సలహాబోర్డు సభ్యుడు | 1958-61 |
| ంధ్రజ్యోతి ఎడిటర్ | 1960 |
| ాష్ట్ర సంగీత నాటక కళా అకాడమీ సభ్యుడు | 1960 |
| ంద్ర లలితకళా అకాడమీ సభ్యుడు | 1961 |
| ాష్ట్ర లలితకళా అకాడమీ సభ్యుడు | 1961 |
| ాజ్యసభకు తిరిగి ఎన్నిక | 1964 |
| ఢిల్లీలో జరిగిన షేక్స్పియర్ సెమినార్‌లో పాల్గొనుట | 1964 |
| దేశీ పర్యటన | 1964 |
| ైదరాబాదు తరలిరాక | 1968 |
| రేశలింగం ఇంగ్లీషు మోనోగ్రాఫ్ | 1968 |
| ేమన మోనోగ్రాఫ్ | 1969 |
| ెడిషనల్ ఇండియన్ కల్చర్ అండ్ ఎస్సెన్స్ రచన | 1969 |

| | |
|---|---|
| లెనిన్ శతజయంతి సెమినార్, బెంగుళూరులో పాల్గొనుట | 1970 |
| విదేశీ పర్యటన | 1975 |
| ఆంధ్రజ్యోతి సంపాదకత్వానికి రాజీనామా | 1977 |
| పావర్టీ ఆఫ్ ఇంటలెక్చువలిజం ఇన్ ఇండియా, (మైసూరు యూనివర్సిటిలో ఉపన్యాసాలు) | 1978 |
| ఇండియన్ కల్చర్, ఇట్స్ కాస్ట్ కాంప్లెక్షన్, (ఉస్మానియా యూనివర్సిటిలో ఉపన్యాసాలు) | 1979 |
| గురజాడ మోనోగ్రాఫ్ | 1979 |
| గాడ్స్, గాబ్లిన్స్ అండ్ మెన్ ప్రచురణ | 1979 |
| విదేశీ పర్యటన | 1980 |
| కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు 'సీతజోస్యా'నికి | 1981 |
| ఈ అండ్ వెస్ట్, నాగార్జున యూనివర్సిటీ ఉపన్యాసాలు | 1982 |
| గీతపై విమర్శ రచన | 1983 |
| ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక సలహాదారుడు | 1983 |
| ,, ,, ,, ,, రాజీనామా | 1984 |
| ఆంధ్ర, వేంకటేశ్వర విశ్వవిద్యాలయాలు డి లిట్. ఇచ్చుట | |
| మరణం | ఫిబ్రవరి 16, 1985 |

## అనుబంధం-5

# ఈ రచనకు మూలాధారాలు

ఇటంర్వ్యూలు

నార్ల తాతారావు
నార్ల గౌరీ శంకర్ } నార్ల తమ్ముళ్లు

నార్ల సులోచన - ,, భార్య

పైడిమర్రి సత్యనారాయణ - స్కూలులో కాలేజీలో సహచరుడు

వి. ఆర్. నార్లతో ఇంటర్వ్యూ టేప్, రచనలు, సంభాషణలు

పత్రికలు

కాంగ్రెసు
కృష్ణాపత్రిక
భారతి
ప్రజామిత్ర
ప్రజాబంధు
జన్మభూమి (ఇంగ్లీషు)
స్వరాజ్య
జనవాణి
ఆంధ్రప్రభ
ఆంధ్రజ్యోతి

రాజ్యసభలో 1958—70 మధ్య వి. ఆర్. నార్ల ప్రసంగాలు :